శా॥ సుకవి బిరుదాంకుండగున్॥

శ్రీయామంబుల రాజఖేలనములన్ వాక్యోపపత్త్యాములన్
భూయోనైపుణమొంది సద్రసికతాభూమాంతరంగాఢ్యుఁడై
మాయాలీగసువృత్తిచే మిగుల సమ్యగ్జ్ఞాని రాజామణి
శ్రేయోనామకపింకుఁడొప్పు విబుధ శ్రేణీమనోహ్లాదియై॥

శ్లో॥ సత్యాహింసావసూయా ప్రియవచనసదోల్లాససంవర్ధమాన
ప్రీత్యౌదార్యక్షమాద్యైః ప్రథమగణితతాం ప్రాపితో యో బుధేంద్రైః
ఆనందేంద్రప్రజానా మమరతరురివ ప్రాప్తరాజావతారః
పాయాద్రాజామణేత్యాముపహృతకవనం మర్త్యనారాయణాంకః॥

| | | |
|---|---|---|
| 8 10 96. | } | ముడుంబై నరసింహాచార్యులు, |
| విజయనగరము. | } | సంస్థానపండితులు |



శ్రీ కాత్యైనమః

# లలితాలతావిలాసము.

శా॥ శ్రీమద్వాసవనందనా చిరకృపాదృష్టిం బ్రకాశించుచున్
భూమిన్ వర్ధిలు వైశ్యవంశజలధిం బూర్ణేందుఁడై యొప్పు నా
కామక్రోధవిదూరు సత్యచరితుఁ ఖ్యాతిప్రభున్ ధీరు ని
త్యామోదాత్ము వదాన్యు నప్పలనృసింహార్యుఁ శివుం డేలుతన్. 1

మ॥ భవదీయోగ్రతరైక చామకహతిం బాయుఁ మదీయాసువుల్
శివ నీమోహసుధం జిరాయు విడుమా సీమంతినీరత్న మీ
వపువందుం దమి ముద్దులాడుపతికిన్ హర్షంబుఁ జేకూర్పు శాం
భవి శాస్త్రజ్ఞుని విన్నకోటకులజున్ భవ్యాత్ము రక్షించుతన్. 2

చ॥ అలుక భృగుండు పాదహతి నాత్మవధూతిలకమ్ము నొందినం
గలఁగక శాంతిఁబూని మునికాంతుని పాదము లొత్తుచుం గుతూ
హలమున సత్కరించిన దయాహృదయుండు రమాహృదీశుఁ డ
ప్పల నరసింహయప్రభుని బండితమాన్యుని నెప్పు డేలుతన్. 3

ఉ॥ భావజమోహనాస్త్ర పరిభావిత రమ్యతనూవిలాసఁ బ
ద్మావతిఁ బెండ్లియాడు నెడ ద్రవ్యవిహీనతఁ గుంద భర్త మో
దావహుఁడై తను న్మనుప నప్పను ల్సచఁ కూర్చినట్టి ల
క్ష్మీవనజాక్షి యప్పలనృసింహవిభున్ శుభదృష్టిఁ జూచుతన్. 4

చ॥ ఒకరినిబోలు చందమున నొంటొకరిం సృజియించ సిద్ధధీ
వికసితమానసుండయిన వేధ వివేకవిభూషణుఁ వనీ
పక నికరాభివందిత కృపాపరిపూరిత మానసుఁ మహీ
ప్రకటిత కీర్తిసాంద్రుఁ గృతిభర్తను బ్రోచుఁ జిరాయు విష్ణుచున్. 5

చ॥ అతిమధురాసవంబునకు నాశ్రయమై. తగు నల్పజిహ్వలన్
గుతుకముతోడఁ దృప్తిపడఁగోరి నశక్యతఁగాంచి యానన
ప్రతతుల సూక్ష్మరూపమున భాసిలు వాక్పతి కావ్యనాయకున్
హతదురితాత్ము నార్య రసికాగ్రణి నారయుతం గృపామతిన్. 6

క॥ సరసిజ కోశభ్రాంతిని
గిరిజాచేటి కుచతటిఁ గేళిని సలుపన్
గిరమును జాఁచు గణేశుఁడు
చిరతరకృప నప్పలనరసింహాయఁ గనుతన్. 7

శా॥ హాళీంద్వగ్నివిలోచనం బురహరం శ్రీశైలజామాతన్ మునీం
ద్రాళీ సంస్తవనీయ పద్యుగఁ ద్రిలోకారాధ్య మత్స్వామి హృ
న్నాళీకస్థ నఘాంతకన్ సుగుణబృందన్ జోగులాంబా మహా
కాళిన్ భక్తి సదా భజింతు నెద మత్కావ్యంబు శోభిల్లఁగాన్. 8

శా॥ శ్రీజాకారు వివేకసారు నురుకీర్తిస్థాను విద్యాధనున్
దేజోవంతుని శాంతిమూర్తిని మహాదేవీ పదధ్యాను గో
భూజోదారగుణాభిరాము ననఘున్ భోగేంద్ర సత్యవ్రతున్
రాజర్షిం బ్రియభాషు సద్గురువు నానందప్రభుం గొల్చెదన్. 9

శా॥ తోరంబై చిగురించు భక్తి భజియింతుం దుంగభద్రాధునీ
తీరాలంకృత కందనోలినగరిన్ దిగ్వ్యాపితఖ్యాతి సం
పారన్ డిప్టికలెక్టరుండయిన ధర్మాత్మున్ సుధీంద్రున్ ఘనున్
క్రూరానీకరిపున్ మదీయజనకున్ గోపాలకృష్ణప్రభున్. 10

క॥ హరిహర చరణాంబురుహ
స్మరులకుఁ గవిశేఖరులకు సారజ్ఞులకున్
వరవర్ణినులకు భక్తిని
గరయుగళంబు మొగిడింతుఁ గవితారుచిన్. 11

క॥ అవసరవరిరలమై రగు
కవనమ్మున దోషముమ్న [illegible]
గవివరులు గరము మనిదిన
భవుభంగిని వేయువేల పార్థన లింకన్. 12

గీ॥ అని మతులొనర్చి జనసుత మఱు నొకండు
వింతకతఁ బల్కనూహించువేళ నహహ
విన్నకోటవంశ సుధాబ్ధి విధుఁడు బుధుఁడు
శ్రీమదప్పలనరసింహ నామవిభుఁడు. 13

క॥ నను మైత్రిని గాంచి జగ
జ్జననీ విమలాంఘ్రికమల సంస్మరణా నే
వినుతు నొక చిత్రకథ విను
మని వాక్రుచ్చె మఱి పలుకు నధికప్రీతిన్. 14

చ॥ ఇల నసమానకీర్తిగల యిద్ధగుణుండు కళింగధారుణీ
తలపతి నీమ కైత సభఁ దర్జయుమెచ్చఁడె రెండు మూఁడు గం
టలను ప్రబంధ మొప్పుగ నొనర్పఁగఁ జాలుదు వీవు మైత్రి పెం
పలరఁగ నేను వాఁకొనిన యట్టి విచిత్రకథన్ రచింపుమా. 15

గీ॥ బాలికలు వృద్ధులు ధరిత్రి పాలకులును
బండితులు వేడ్కఁ బఠియించు భాతి నీదు
సహజసరసాశు కవితారసంబుఁ జిలికి
యావిచిత్రకథ నొనర్పు మిప్పు డెలమి. 16

ఉ॥ అక్కట నే ననేకవిషయమ్ములఁ జిక్కి కడుం గృశించుచో
నొక్కనిఘంటువైన సరసోక్తుల నేటివి కూర్ప లేనిచోఁ
జక్కని చిత్రగాథను రసంబొలుకం బచరించి కైతఁ బెం
పెక్క ఘటింపు మంచు నను నెంతయుఁ గూరిమి నాతఁ డాడినన్. 17

సీ॥ దొరలబ్బురమునంద నరిగాఁగఁ గరిమీఁద
మించు మోదమున నెక్కించుకొనిరాఁ
గండక మల్ల వ్యాగవ్య పాండిత్యము
నింపార సభల నగ్గించసాఁగె
పత్త్రచిత్త్రమున నైమఱచి నిద్రించుచోఁ
జెయిఁబట్టి లేపి భుజింపఁజేసి
మసలక యనుభవ రసికశతకము
విరచింపఁగ సుకవి బిరుదొసంగె
నట్టి యానందగజపతి యరిగినంతఁ
గంది జీవచ్ఛవంబుగా నుండఁగా దె
మత్కృషిత నింతరస మొలుక్క మాటవింత
రసికులాదరమ్మున మన్పరాదొ నన్ను. 15

సీ॥ అవసీనతంబుగా నాయురున్నతి దేహ
దార్ఢ్యత నిడు నియుద్ధంబునందుఁ
నైచాయుగనరాని మాడిక నమందగ
తిని ఖడ్గయుగళంబుఁ ద్రిప్పుటందు
శార్దూల కిటిముఖ్య జంతుజాలంబును
నరకుచేయక చీల్చిచంపుటందు
గీర్తిసిగాంచు క్రికెట్టు టెన్నిసు బిల్లి
యర్డ్సు మొదలయిన యాటలందు
ననయ మతికఠినాత్మ్యండ నగుచు నుండు
సరసనందోహమును దేర్చు జాణ వీవు
రావణునిచేతఁ జిక్కిన రంభవోలె
శఠుని నఁజేరినావు హా శారదాంబ. 19

క॥ అని రసికులకును వాక్పతి
కిని మతివందన మొనర్చి కృతి యింతరసం
బెనయఁ బలుకఁ దొడఁగెద వా
యనఘుఁడు కృతి భర్తగాఁగ నలరుచునుండన్. 20

గీ॥ శ్రీధరసగోత్రుఁడగు జగ్గయాధిపతికి
రామయ జనించె నతనికి భూమినుతుఁడు
జగ్గయార్య వతంసుఁడు జన్మ మెత్తె
విబుధులు సంతోషభరమున వినుతి సేయ. 21

గీ॥ ఔర భారత భాగవతాదికృతుల
శుద్ధలిపులను వ్రాయంగ సూరివరులఁ
గూర్చి వేనవేలొసఁగిన గురుయశుండు
జగ్గయార్యుఁడు సామాన్యజనుఁడె ధరణి. 22

క॥ పేరమ నప్పను వెంకమ
వారవ్యచరితుఁడు పెండ్లియాడెం బేర్మిన్
బేరమ్మకుఁ గామమ్మ స
తీరత్నం బుదయమయ్యె దిఙ్నుతిగనుచున్. 23

గీ॥ వెంకమకు నప్పలనృసింహ విభువరుండు
రామమూర్తినామక జగత్ప్రథిత పద్మ
నాభుఁడుఁ బెరుందేవమ పొడమి పొడమె నార
యార్యవినుత సీతారామమాఖ్య సాధ్వి. 24

క॥ జనవినుత హూణభాషా
జనితవినయ వాగ్విముఁడయి సబ్బురిజిస్ట్రా
ర్పని నతిగౌరవమందుచు
వినుతిగనుచు రామమూర్తి విభుఁ డిల నలరున్. 25

క॥ ఆయప్పల నరసింహాయ
నాయనఘాత్ము వణిగన్వయాంభోధిశశిన్
న్యాయాన్యాయవిచక్షణు
న్యాయార్జితధనుని బొగడ నలువవశంబే. 26

చ॥ అలఘుచరిత్రుఁ డూర్జితగుణాఢ్యుఁడు జగ్గయ నిష్ఠతోఁ ద్రిమూ
ర్తుల భజియించుదాననొకొ తోఁచె విరించివివేక మీశుని
ర్మలదయ విష్ణుశాంతిగొని మానుల భూషణుఁ డర్థిపోషుఁ డ
ప్పలనరసింహయాఖ్యుఁడని పల్కుదు రెప్పుడు వైశ్యపుంగవుల్. 27

మ॥ కులకాంతాకులమెంచఁ డన్యధనముం గోరండు దుఃఖించు వీ
డలఁ బోషించకమానఁ డిష్టజనసంతానంబులన్ బంధులన్
బలవంతంబుగ మన్నికాని నిదురింపంగాఁ జనం డెట్టి మా
యలఁ బన్నండవునౌర యప్పలనృసింహార్యుండు సామాన్యుఁడే. 28

సీ॥ అపకార మొనరించు నతినీచునకు నైన
నుపకార మొనరింప నూను నేతఁడు
తనసొంత కార్యములను నీఁగి పరులకు
సాయము సేయంగఁ జను నెతండు
సద్గుణములకును స్థానభూతుండయ్యు
గర్వ మొకింతైనఁ గనఁ డెతండు
వేదశాస్త్రపురాణ విజ్ఞానకలితుఁడై
జడునిభంగిఁ జరింప సాఁగు నెతఁడు
సత్కులంబునఁ బుట్టి కష్టంబులొందు
నఖిలజనములఁ బోషించు నాతఁ డెతఁడు
వట్టివిన్నకోట కులార్ణవాబ్జు ననఘు
నప్పలనృసింహాయ మతింప నలవియగునె. 29

సీ॥ సద్గుణరహితులై చక్రవర్తికరుణఁ
బడయఁ బైకము వెచ్చపఱుచువారు
సాలభంజికలట్లు సౌందర్యమునుగాంచి
నీతివిహీనులై నెగడువారు
యక్షునిబోలె ధనాఢ్యతులై యుండి
వితరణలేశయే వీగువారు
శాస్త్రపురాణ రసం బానఁజాలక
పండితోత్తములుగాఁ బ్రబలువారు
కటకటా లభింపరటంచుఁ గలవరించు
మావిశాఖపట్టణము సంబరము గొనఁగ
నయగుణుఁడు నీతివిదుఁడు దానప్రియుండు
విబుధుఁ డప్పలనరసింహ విభుఁడువఱలు. 30

కం॥ ఆయాయి యుగములందు మ
హాయశమును గనిన ఘనుల నాఘనుఁ బోల్పన్
హా యతిశయోక్తిగాఁ దల
పోయుమ రతని గనుదాక బుధబృందంబుల్. 31

కం॥ ఆదాన ధర్మసద్గుణ
మాదివ్యవివేక మాదయారస మాహా
మేదిని నొక్కరితరమా
యాదిఫణీంద్రుండుగాక యభివర్ణింపన్. 32

కం॥ భూనుతసద్గుణ నికర
స్థానుఁడగు వణిగ్విభుమణి జన్మస్థలమౌ
కోనమశివాసిపాలెం
బౌనాఁ గనినట్టి పుణ్య మసచే తలఁపన్. 33

గీ॥ నిరత మతిభక్తిఁ దనుఁ గొల్వ నరసమాంబ
యంమ సుతఁ బెరుందేవమ్మ యను సుశీల
నెలమిగని సప్తసంతాన ములను గాంచి
నట్టి యమ్మహాత్మ నుతింప నవనితరమె. 34

క॥ శ్రీవిజిత వైశ్రవణునకు
భూవినుత యశఃప్రియునకుఁ బుణ్యాత్మునకున్
దేవాంశ సంజనితునకు
ధీవరవృషభునకు భోగదేవేంద్రునకున్. 35

క॥ సంతత సుకవిప్రకర
స్వాంతామోదునకు సకలజనమిత్రునకుఁ
గంతురిపుస్మరునకు మతి
మంతునకు నితాంతశాంతి మరువశనునకున్. 36

క॥ శ్రీశారదామకుటము
ద్రాశాలాధిప్రభునకు రసికేంద్రునకున్
ద్రైశంకు వచస్కునకు మ
హీశవ్రజనిత్యనుత్య కృతపుణ్యునకున్. 37

గీ॥ శ్రీమదప్పల నరసింహ నామకార్య
మణికి దీర్ఘాయురారోగ్య మహిత సంప
దాభివృద్ధికరంబుగా నంకిత మిడి
యేరచించుకథకు నాది యెట్టులనిన. 38

క॥ హరిపదజారోధంబున
హరిహయ పుటభేదనమ్ము నటువొమ్మను సుం
దరతరనగరం బొక్కఁడు
గరమలరు రమాకరమను ఘననామమునన్. 39

గీ॥ అన్యకార్యము లొనఁగూర్చు నఘమటంచు
నధ్వరంబులు సలుపుట యందుఁగాక
వేదశాస్త్రము లనుఁగాక వేరుదలఁచ
రచటి విప్రుల వినుతింప నజునివశమె. 40

కం॥ తరుచాటున నుండి కపిని
బరిమార్చ్పరఘూద్వహుఁడని బాహుజు లతనిన్
బరిహాస మెపుడు చేయుదు
రురుతర బాహుయుగ విక్రమోన్నతి నచటన్. 41

కం॥ కులధర్మము విడనాడరు
కల సంపదఁ జోరులుగొనఁగాఁ జాఁటరు ని
శ్చలమతిని దానధర్మము
లలరం జేయుచును దగుదు రచటి కిరాటుల్. 42

కం॥ కులవృత్తికి వెనుదీయక
దలమూఁటలు మోసి కనిన ద్రవ్యంబును రా
జులు వేఁడఁగ నొసంగుదు
రలకాపతిపోలె ఘనతనందుచు శూద్రుల్. 43

కం॥ పరసతుల మీరు గలసినఁ
బరపురుషుల మీసతులొగిఁ బైకొన నుంకిం
తురు గాన విటత్వమకట
సరిగాదని తమసుతులకుఁ జాఁటుదు రార్యుల్. 44

ఉ॥ ఆనగరంబునందు నడయాడు నలక్షిక లప్సరోంగనా
మానము మాయుమాత్కిసుమమార్గణ సంభవలో యనంగ భూ
జానిసభాభిమానమున సంభృతగర్వముసం జరింతు రెం
తేని బలాత్కృతింగలుము లిచ్చి విటుల్గయిమోడ్చి వేఁడఁగాన్. 45

ఉ॥ మీటునిజస్తనద్వయము మించిన తుంటరులం గనుంగొనన్
దాటని కైరవంబులను దంతరుచిం గొనలేని మల్లెలన్
నీటగు మోవిచాయ గననేరక యుండు జపాసుమంబులన్
వీటిని బుష్పలావికలు విల్తురు జారుల మోసపుచ్చుచున్. 46

గీ॥ పైకిఁ గన నసహ్యతదోఁచు పగిది నుండు
కులసతులు భర్తమనసిచ్చిఁ గలుగు నపరి
మితసుఖంబంచు బోధించు గతిని బనస
ఫలము లానగరి మకాణములను గాంచు. 47

క॥ కరితురగ స్యందనములఁ
బరిఖావప్రముల నింత పలుకం దరమా
సురనక్తంచరశిల్పులు
విరచించిన యట్టులలరు వేయేల నుతుల్. 48

క॥ హరిహర విలాసుఁ డనియెడు
హరిహరభక్తుఁ డొకఁ డామహానగరంబున్
బరిపాలించుచు నుండెం
బరిపంథి సముత్కరంబు ప్రణుతు లొనర్పన్. 49

క॥ అనపత్యుండై యంగద
తనయ మతఁడు భోగవిముఖుఁడై యుండ జగ
జ్జనయిత్రి గొల్చు శంఖ
స్వనుఁడను ముని తేరి గానవచ్చె స్వేచ్ఛన్. 50

సీ॥ భూరియుగ మాధ్యఁ గెంపుసు విరియించి వాఁ
కుంకుమరేఖ దాల్చుచునుండ
ద్వీపిచర్మవసనంబు దివ్యదుకూలంబు
నమర నాగవిభూష సౌందర్యమొసఁగఁ

బటుహీరములమించు స్ఫటికపుమాలిక
కంఠదేశంబున గంతులేయ
దండినిజదిపించు తనయోగదండంబు
హస్తతలంబున నలరుచుండ
ధూర్జటిజటావితానముతోడఁ దూఁగు
తనజటాజూట మాగకూట మనఁగనలర
నాతురంబుగావచ్చిన యమినిగాంచి
దిగ్గునను లేచి మ్రొక్కె ధాత్రీధవుండు. 51

గీ॥ అంత సుచితాసనంబున నాతపస్వి
నెమ్మి విశ్రమించి నృపాల నీకు శుభమె
నీమమంత్రులు భటులు ననింద్యభక్తిఁ
గొలుతురే ప్రజ లతిసౌఖ్య మెలమిఁగాంతె. 52

గీ॥ సుమతి సతి నరుంధతి ననసూయ సీత
వేదవతిని సుకన్య సావిత్రిని దమ
యంతి మదయంతి మీటునీయంతిపురము
వాహినీదేవి క్షేమమే వసుమతీశ. 53

క॥ అని పోచ్చరింప మునినా
థునకు నరపతి దలవాంచి దుఃఖమువలనన్
గనునీరు గాల్వలగుచోఁ
దినదిన్నఁగ నిట్టులాడుఁ దికమక యగుచున్. 54

సీ॥ శ్రీరాజరాజేశ్వరీ వేశ్మ మందక
దంబారు పుటభేదనంబువోలె
రాజీవరాజీవరాజిరాజితమగు
వరతటాకములేని వనమువోలె

హస్తంబునం జాల నణఁగిన యసిలేక
వేఁటకుఁబోవు వీరువోలె
నవరసాలంకృత నాగరికాగ్రణిఁ
బలిగాఁగఁబడయని పార్థివోలె
భాస్కరమయూఖహీనమౌ పగలువోలె
రాజపూజితగాకుండు రాత్రివోలె
నాత్మజన్మసిగాంచని యస్మదీయ
కాయ మకుటా ధర వమ్ము గాదె తలఁప. 55

కం॥ తనయుండు లేని వైభవ
మనఘాత్మ రుచింపఁగలదె యస్మత్సుకృతం
బునఁ దాపసి దర్శన మిట
వనువవడ లభించె నింక నభివాంఛ చనున్. 56

గీ॥ అనుచు నృపుఁడు మునివరాంఘ్రులందుఁబడిన
నతఁడు కరుణాయతాత్ముఁడై యధిపుఁగాంచి
వనటపూనంగ నేల యీపనసతొనను
నీసతికి నిమ్ము సుతుఁడు జనించు నమ్ము. 57

కం॥ అనిమాని దానుదెచ్చిన
పనసతొన నృపతికి నొసఁగి పార్థివతిలకా
ఘనభక్తి శక్తిఁ గొలువం
జనునని యరసునుతులు గొని చనియె యథేచ్ఛన్. 58

గీ॥ అంతనిధిని గాంచిన పేద యటు లతండు
హర్షరోమాంచితుండయి యాత్మసతికిఁ
బనసతొననివ్వ నాసాధ్వి పరమభక్తి
నదిగొని భుజించి గర్భంబు నలరఁదాల్చె. 59

సీ॥ ఉండియుండనియట్టు లున్నయన్నవ శేఁష
నడుమెంతయేనియుఁ బొడవుసూపె
గుబ గుబ లాడుచు ఘుమ ఘుమాయించు వా
గ్గంధము మద్గంధ కలితమయ్యె
హంసయానగమన మతిమందతను బూనె
మృద్భక్షణాపేక్ష మిట్టిపడియె
శశిముఖి ముఖవిలాసము మాయమైపోయె
నాతి వృంతంబులు నల్లబాఱె
వనవిహారంబు సలుపంగ వాంఛ వొడమెఁ
బురుషముంగలశాసిగ్గు పుటమరించె
నధికసురతాభిలాష యెల్లపుడు దోఁచె
నృపవధూలలామకు గర్భమెదిగియెదుగ. 60

గీ॥ అంత దశమమాసమున శుభైక లగ్న
మందు నబ్జబాంధవుఁ డుదయాద్రి నెక్క
తరుణమున రమాకరపురోత్సవముగాఁగ
ధారుణీశ వధూటి నందనుని గనియె. 61

క॥ బాలార్క బింబమోయనఁ
జాలఁ బ్రకాశించుచు నటు జనియించినయా
బాలువిలోకించి ముదా
పాలుఁడగుచు భూతధాత్రి వల్లభుఁ డలరెన్. 62

క॥ విధి దృష్ట విధానమ్మున
నధికోత్సవ మాచరించి యాత్మభవునకున్
బుధవరుల దీవెనలతో
నధిపుఁడు శాళిప్రసాదుఁ డనునామమిడెన్. 63

ఉత్సాహ॥ శ్లాఘవాగ్రసచివునకును సైనికాధిపతికి గో
శాధికారికింగుమారు లటజనించి యుండ గో
త్రాధినాథుఁ డర్భకులకు హర్మ్యమొందుగూర్చి ని
త్యాధికప్రమోదపులకితాంగుఁడగుచుఁ బెంచెఁదాన్. 64

సుగంధి॥ వీరుఁడైన తండ్రిమెచ్చ వేదశాస్త్రవేద్యుఁడై
ధారుణీశ నీతిగాంచి దారుణాస్త్రగోప్యముల్
ధీరతన్ గ్రహించి యద్వితీయుఁడై చెలంగె నా
కారవైభవంబు మీఱఁగా నృపాత్మజుండటన్. 65

ఉ॥ యుక్తవయస్కుఁడైన తనయుం గని భూపతి పెండ్లిసేయ నా
సక్తిని బూని యొక్కరుఁడ జాలిని వీడెఁడి నావనమ్మున౯
రిక్తమనోరథుండగుచుఁ ద్రిమ్మరుచో నొక వృద్ధకాంతగా
శక్తిప్రసన్నయై విను రసావర కన్యక యున్నదొక్కెడన్. 66

ఉ॥ ఉర్వరకు౯ విభూషయగు నుత్కళదేశమునన్ మరుత్పురీ
గర్వమడంచుచుం గడలిగట్టునఁ బట్టణమొక్కఁడొప్పెడు౯
శార్వరిపేర నందు నృపసంభవయై లలితాలతాఖ్యయా
సర్వగుణాఢ్యయుండు సుతుసాటియగున్ మఱియేరు లేరిలన్. 67

క॥ సురసిద్ధసాధ్య కిన్నర
నరనాగతరుణులయందు నవమోహన సుం
దరతరరూపంబున సుం
దరులెవ్వరు నాసతి సరిదగరు నరేంద్రా. 68

మ॥ ధరణీనాథ యొకండు గోప్యము దగ౯ దత్కన్యకారత్న మీ
శ్వరి సంపూర్ణ దయం ద్వదీయ తనయోద్వాహార్థమై తోఁచె సుం
దరిఁదక్కన్ మఱి లేఁతినాతిగలయన్ ద్వన్నందనుండక్కటా
మరణంబొందు నటంచుఁబల్కె సతి దా మాయావిభూతింజనెన్. 69

చ॥ నరవరుఁ డంత సంతసమున న్సభకుంజను దెంచి శార్వరీ
పురికి సురేఖతో ద్విజులఁ బోవఁగఁ జేసి సువార్త రామికిం
బరిపరిభంగులందలఁపు పాటిల రాజ్యసుఖంబు నీఁగి యీ
శ్వరిఁ దలపోయు సాఁగె జనవల్లభసూనుఁడు వేఁట వేడుకన్. 70

క॥ తన నేస్తగాండ్రతోడిం
పెనయఁ దురంగముల నెక్కి మృగయాభిజ్ఞుల్
పనిచిన త్రోవం జనిచని
కనుఁగొనియె నొకండు ఘోరకాననసీమన్. 71

శా॥ ఆరాజన్యతనూజుఁ డిష్టతతితో నాఖేటనోత్సాహుఁడై
ఘోరారణ్యమునం జొరంబడి యతిక్రూరేభ శైలాటభూ
దాగ వ్యాఘ్రవృకాది సత్వముల సత్వం బుగ్రతం బాపుచో
సారంగంబట శాతకుంభరుచిరచ్ఛాయాకృతిం గన్బడెన్. 72

చ॥ గతికఁ గసింత సేయుచును గంతులు వైచుచు గొంతుద్రిప్పుచున్
జుఱచుఱ చూచి పాఱుచును జోద్యముగా నెదురన్ భయంబులే
కజిమిజి వేఁడ్కతోడఁ జెరలాడెడి లేడిని గాంచి యాతఁడుం
పఱఁబఱుపం గనోడి యది పట్టుటకుం దలపోసి పైఁ జనెన్. 73

క॥ తన వెంట రాకొమారుఁడు
సను దేరఁగఁ బాఱి లేడి చటియలఁ దూరెన్
గనక చని వనీమధ్యం
బునఁ గనెఁ బ్రాసాదమతఁ డపూర్వముగాఁ గన్. 74

శా॥ నానాసుందర పాదపోజ్జ్వలిత కాంతారంబు మధ్యంబునన్
క్ష్మానాథప్రవరాత్మజన్ముఁడు జగన్మాత్రాలయంబుండఁగా
వానందంబలరార నంతఁ జని ఘోరాకారు యోగీశ్వరున్
ధ్యానాయత్తహృదబ్జుఁ గాంచి దరిలెం దచ్ఛాపభీతిం ద్వరన్. 75

చ॥ ఇనుఁడు దివాంధసంతతిని నేఁచుచుఁ బాపముఁ గట్టుకొంటి నం
చును గడుఖిన్నుఁడై వనధిఁజొచ్చినఁ దద్దురితాగ్నిఁ దాళకం
బునిధి హలాహలంబువలె ఘోరునఁ గ్రక్కె నొకో యనం దమం
బనుపమవేగలీల వనమంతటనంతటఁ గప్పె గాఢమై. 76

చ॥ చెనటితనమ్మునం గటికి చీఁకటి యంతటఁ గ్రమ్మినంతటన్
జనపతిసూనుఁడందు నిసి జాగ్రతనుండఁదలంచి మిత్రులం
గని మన మిందు వంతుగొని కాపొనరింపఁగ నొను జాము జా
మునకు నొకొక్కఁడుండఁదగు ముప్పరుదెంచు నటట్టుగానిచోన్. 77

శా॥ కోశాధీశజుఁడంత మేల్కని నిశన్ గొంతెత్తి యమ్మౌనిలో
కేశుం డస్థిని బెట్టి మంత్రమున నెన్నె నస్థులొప్పారె సై
న్యశోద్భూతుఁడు గాపు సేయుగతి యోగీంద్రుండు మంత్రింప నెం
తే శోభిల్లె మృగాకృతిన్ సచివవర్యేష్టాత్మజుం డుండఁగాన్. 78

మ॥ యతిమంత్రింపఁగ మాంసచర్మసహితంబై లేడిగా నొప్ప భూ
పతిజుం డుండఁ దపస్వి మంత్రముఁ బఠింపన్ జింక సప్రాణమై
యతివేగంబుగఁ గానఁబాఱె నవురా యంబాపదద్వంద్వ సం
గతచిత్తాంబుజుఁడైన యత్తపసి వాగ్ధర్మం బపూర్వంబిలన్. 79

చ॥ ఇనుఁడొకయింత యంతనుదయింప జనాధిపనందనుండటం
దనరు ఝులఝ్ఝులంబున ముదంబలరంగఁ గృతావగాహుఁడై
తనదు సఖాళితో మునివతంసునకున్ జగదంబకున్ జొహా
రనువుగ నల్ప భక్తి దగ నాగుడిలోపలికెం జనేన్వడిన్. 80

క॥ చని యచ్చట యమిరేమికి
మనమెరియఁగ వింతదెల్పి మనుజాధిప నం
దనుఁ డుగ్రబింబ నంబం
గని మ్రొక్కి నుతించెఁ దనకు ఘనభక్తి యొడన్. 81

కం॥ అంబాసదనముఁ బాసి ము
దంబునఁ దనసఖులతోడఁ దడయక యాతఁడ
శ్వంబుపయి నెక్కి చనిచని
పంబినవటపాదపంబుఁ బథమునఁ గనియెన్. 82

కం॥ కని విశ్రమించి సఖులం
గని రాత్రిజరిగిన వింతఁ గలయంబలుకం
జనునని యాఁడుదాన నుండెను
వినిన కనిన చిత్ర మట్టు విఁదిరి వేడ్కన్. 83

చ॥ మనుజకులాధినాయకకుమారకుఁ డంత నాప్తమిత్రులం
గనుఁగొని [illegible] నుల్కులు విచ్చుచు మంత్రముం బఠిం
చిన మునినాశిమాలి దయచేత లభించెను మంత్ర మద్దిరా
మనమటు లాచరింతుమన మైకొని రందఱు మించువేడుకన్. 84

గీ॥ అంత విభునాజ్ఞఁ గోశాధిపాత్మజుండు
వనిని బడియున్న యొకయస్థి గొనుచు మంత్ర
ముచ్చరింప నెన్నెనస్థు లుర్వి వ్రాలె
నౌర కరకాని కాయంబు లగు ననంగ. 85

కం॥ మౌనివరమంత్ర మంతట
సైనికవరనందనుండు జపియింపంగన్
మానుగ నాయస్థిచయం
బానిమిషంబున నహహా మృగాకృతిగొనియెన్. 86

గీ॥ అంత మునికాంతు మంత్రము నధికభక్తి
మంత్రితనయుండు పఠియింప మాంసరక్త
చర్మమండితంబై పులి చాయ గొనియె
నది నృపాత్మజసఖులు భయంబు వడఁగ. 87

క॥ అడవిమెకమ్ములఁ గ్రూరత
నడరెడు పులిరూపుగాంచి యధిపానుచరుల్
గడగడవడఁకుచుఁ బెదవులఁ
దడిలే కొక్కట విభుని పదంబులఁ బడుచున్. 88

క॥ కారుణికాగ్రణి తిలకా
సారలమెకమయ్యె మంత్ర సారము దెలిసెన్
దారింకమంత్రమాడిన
వారక మీఁదఁబడి మనల వధియించుఁగసిన్. 89

క॥ అనిమంత్ర మాడవలదని
తను వేఁడుసఖులఁ గని దొర తగునే యిటువాఁ
కొనమీకు మంత్రబలమేఁ
గన కెటులుండుఁ బఠియింపఁగాఁ జను ననుచున్. 90

గీ॥ మాఱుమాటలాడక వారు మావులపయి
నెక్కి తూరుపుసంద్రపు దిక్కుగాఁగ
వాజుల ధవుడాయించుచు వడిగఁ జనిరి
ప్రభువు నొంటరిగాఁ జేసి పందలగుచు. 91

మ॥ వెనుకంజూడక పాఱిరక్షితి నటు వే విచ్చేయు మిత్రాళిమై
త్రిని నిందించుచు మౌనినాథపదనీరేజద్వయం బెంచుచున్
ఘనుఁ డంబాకరుణానులబ్ధబలుఁ డా కాళీప్రసాదుండు మిం
చినభక్తిన్ మునిరాజమంత్రముఁ బఠించెన్ వర్ణనాగ్ర్యఖరిన్. 92

గీ॥ ప్రభునుతుండట్లు మంత్రముఁ బలుక మంత్ర
బలమువలన వ్యాఘ్రంబు సప్రాణియగుచు
నిదురనుండి లేచినగతిఁ బదరి లేచి
యతనిమీఁద లంఘింపఁ బ్రయత్నపడియె. 93

క॥ త్వరితగతి నంత నవనీ
వరసుతుఁ డసిఁ జేతఁ బూని వైద్యుతరుచులన్
నిరసింపఁగ నతిచాతురి
గిరగిరయని దానియెదుర గెబ్బునఁద్రిప్పెన్. 94

క॥ అసికి మఱుఁగువడిన తనువుఁ
గసిగింతయుఁ గనక జడిసి క్రచ్చఱఁ బాఱెన్
దెసలుగనక పులి కాళీ
ప్రసాదుఁ డశ్వంబునెక్కి ప్రమదమునఁ జనెన్. 95

క॥ చని సాయంసమయమ్మున
వనచరమృగపక్షిరహిత వనము గడచి ప్రా
గ్వనధితటంబున సఖులం
గని యాలింగన మొనర్చి ఘనుఁ డింపెనయన్. 96

మ॥ కనదుత్తుంగతరంగఫేనకులరంగద్వార్నిధిం గాంచి చ
ల్లని గాలిన్ శ్రమ యార్చుచున్ సరససల్లాపంబులం జేయుచున్
దనఖడ్గక్రియ వ్యాఘ్రముం దఱుము చందంబున్ సఖుల్ మెచ్చఁగా
జననాథాత్మజుఁ డాడుచోఁ బడవ రాసాఁగెం బ్రతీరంబునన్. 97

గీ॥ దైవయోగంబుచే నట్లు తటముఁ జేర
నావ యరుదేర ముదమంది నావికుఁ గని
వినయవాగ్రీతి దమపాట్లు వినిచి వెంటఁ
దోడుకొనిపోవ వారంత వేఁడుకొనిరి. 98

గీ॥ అనుడు నావికుఁ డట్లైన వాఁకొను భుజించు
వస్తువులు చాలవైన వీల్పడును గాని
మొదలుగనఁబడు పురియొద్ద వదలువాఁడ
నదియు సమ్మతమేని రానగు ననంగ. 9

క॥ అని యోడ యొడయఁ డాడిన
విని యాఁకొని యతఁడు గోర వేడ్క హయంబుల్
గొనుమని యొసంగి పడవం
జని రందఱు విధికృతంబు సడలునె యనుచున్. 100

చ॥ శరమదయప్రపూర్ణ జలజాతవిరోధి నిజాంశుజాలముల్
విరహిణు లార్వఁ జోరవిట వృత్తుల హాని ఘటించుచున్ భయం
కరుఁడయి యంత భూస్థలిని గప్పె సముద్రుఁడు రౌద్రుఁడయ్యె నా
గురునకు ద్రోహమున్ సలుపు మాంత్రికుఁడు దండ్రికి మోదమిచ్చునే. 101

చ॥ ఘటభవరాఘవార్ష్వలకుఁ గాలగరంబునకుం గడింది సం
కటపడినావు నీవయినఁ గష్టములన్ జనులొందఁ బ్రమే
కటకట యాదితేయులకుఁ గల్గు లొసంగిన దాతవీవు మి
క్కిలి నను మార్చి నెమ్మి నిటుఁ గావుము దీనజనాళిపోషకా. 102

గీ॥ అత్త మీఁదికోపము కుఱిఁదయందుఁ జూపు
కోడలికిఁ దోఁచునీడగాఁ గోడుమీఁది
యలుక నీవిటు లాడుకొంగ నగునె యనుచు
నాఁక యిటులట్టులూగి చీకాకువడియె. 103

గీ॥ పడవ పడుపాటు నా యోడ యొడయఁ డరసి
తనము నేర్పున దాని గట్టునకుఁ దీసి
వాండ్రనలువుర డించి సిర్వామిఘా
యడఁగునంతాక నటనుండి యరిగె వీఁక. 104

క॥ పడవ చనినంత ధైర్యము
విడువక దైవము దలఁచుచు విషధితటమునన్
గడువడఁకె సాఁగిరి చకికి
నెడఁ దోఁచినట్లు వారలెంతే యనుచున్. 105

మ॥ వనితాతీక్ష్ణదృగంబకంబులఁ గుచద్వంద్వాగ్రశూలంబులన్
ఘనసారైణమదేరితప్రణయవాగ్బంధంబులన్ బాధబం
ధనలన్ గ్రాగెదు నీకు లజ్జగలదా ధర్మాత్ములన్ సత్క్రియా
ధనులన్ మమ్ముఁ గలంచ నేటికి చలీ దైవం బహో యోర్చ్వనే. 106

చ॥ అని సుతమీఁది ప్రేమమున నంగజ రమావళులన్ సముద్రుఁ డం
చును జగమెన్ను నూర్మికల సొంపు నుతించుచు పుత్రుఁ గూర్ప నిం
ద్రమనకును సాయమయ్యె నివె చొల్లి యటంచును ఫేనపుంజమున్
గనుచును గల్యకృత్యములు గ్రచ్చఱఁ దీర్చి ప్రయాణులైయుటన్. 107

మత్తకోకిల॥ సోఁకుమూకల మూఁకఁ ద్రోయన సౌఖ్యచీమలబాఱనన్
తీకుమీఱఁగ నాకసంబును ఢీకొనం జను దేవర
త్నాకరంబు తటంబు నేఁ బ్రవణంబుగా రవళించు నా
చాకుమ్రాకుల చాలొసంగెడు చల్లగాలికి సోలుచున్. 108

గీ॥ గర్భములువిచ్చి పెల్లుబ్బు కలమసస్య
జాలమెన్నుచుఁ బనసరసాలసాల
వకుళదాడిమీనారంగ వటముఖ ద్రు
మలనిలయమైన యారామ మెలమిఁ గనిరి. 109

వ॥ కని వారచ్చట నిచ్చవచ్చుఫలసంఘాతంబుఁ బుష్పాసవం
బును సంతుష్టిగ నంది నవ్యనళినీపూరంబునై సత్కవీం
ద్రనివేశంబగు నీరజాకరము నీరంబెంతయుం గ్రోలి దా
రిని బోసాఁగిరి లేనిపానములు వారిందాకుచుం బాఱఁగాన్. 110

గీ॥ పర్వపర్వమునకుఁ బర్వు మాధుర్యము
వలెను నేస్తగాలరవలయు నసుట
గనఁబడంగఁ జేయు కాంతార కాంతాగ
ములను జూచి వారు మూరిఁ బోయి. 111

కం॥ పరిరక్షించిన కరుణా
పరు మేల్మఱువఁ దగదనుట ప్రకటించుగతిఁ
శరయుత ఘటసమ ఫలములు
ధరియించిన నాళికేర తరులం గనుచున్. 112

చ॥ నళినహితుం డనర్గళఘృణిం జెలరేఁగఁ దదీయరశ్మికిన్
దళతళయించు నప్పునుకదాలుపు గట్టు నిరాకరించుచున్
గళుకులకుప్పగా నెమటఁ గ్రాలుచునుండు నికేతనాగ్రముల్
జళుకుదొలంగఁగాంచి నృపసౌధము గుంగదయంచు నెంచుచున్. 113

తరల॥ నడచి శ్రీలలితాంబికాసదనంబుఁజూచి మహేశ్వరిన్
గడిఁది భక్తిని మ్రొక్కి యప్పురిగాంచుకోరికఁబోవుచో
జడుపు పుట్ట శివారుతంబులు సాఁగె గృధ్రవితానముల్
సుడులు గట్టుచు మీఁదఁబాఱెను శోకమందఱు పూనఁగాన్. 114

గీ॥ అంత నారాజవీథిపై నరిగి యరిగి
యందునొక్కరి నైనఁ దామరయలేక
యద్భుతంబంది భయకంపితాత్ములగుచు
నలఁతిదూరమ్మునఁ గనిరి హర్మ్య మొకఁడు. 115

కం॥ శీతకరప్రస్తరమయ
మైతగుసౌధంబుగాలి నరాశ్వంబుల్
ప్రీతి శ్రమవోవ నిలిచిన
ఖాతిని నుష్ణాంశు లలరెఁ బాంథులు వడరన్. 116

కం॥ చిటపటలాడెను నెండలు
నటులిటు లగుచుఁ జని విన్ను నంటుచుఁ గాంతి
చ్ఛటఁదగు ప్రాసాదంబునఁ
దటుకునఁ గాంచిరి నలువురఁ దరుణీమణులఁ. 117

కं॥ లచ్చికిఁ దోఁబుట్టు లగుచు
విచ్చలవిడిగా జగముల విహరించెదు నా
యచ్చరలు వయ్యాలి సలుప
విచ్చేసిరొకోయటంచు వీక్షించునెడన్. 118

కं॥ పసగల చనుల భరింపక
యసియాడెదు నడుముమీఁద నఱచెయి యిడుచున్
గుస గుస లాడుకొనుచు సం
తసమున ముగురు డిగివచ్చి తళుకులెసంగన్. 119

కं॥ పలుకులఁ దేనియ లొలుకఁగఁ
బలువిధముల మనిచి మేడపై వారినొగిన్
నిలుచుకొని చనిరి వీరుల
బలిమిని గొనిపోవు దేవ భామలనంగన్. 120

గీ॥ నరవరసుతానుచరుల మువ్వురు వరించి
లాఁతికన్నియ నృపసూనుఁ బ్రీతిఁ జేర్చి
సకలభోగంబు లెందు నిష్టంబువోలె
ననుభవింపంగ నగునైన వినుఁడు మీరు. 121

గీ॥ మాయుదంతముగాని స్థానీయవిషయ
మేని మందలింపంగ రా దెపు డనంగ
నంద అతిథితి నీఁకొని యందునుండి
రంత నాల్గవ యన్నువ యింతవంత. 122

గీ॥ ఒక్క-మాటైనఁ బలుకక వోర్పుగలిగి
రాజసుతునకు మజ్జన భోజనములు
దాను గూర్చుచునుండె నతండు మార
చండశరశిలీముఖవిదగ్ధుండు గాఁగ. 123

గీ॥ సింధు వెత నాతఁ డాహార సీమ లుడిగి
యేదిదోఁచక కటకటా యెన్నియేని
దివసములు వేచి యొకనాఁడు దీనభావ
మునుముడింపంగ నాకన్యకను వచించె. 124

ఉ॥ భీతమృగాక్షి నీవు పుటభేదన మెయ్యది తల్లిదండ్రు లే
పూతచరిత్రు లల్ల పువుబోఁణుల నేస్తమ దెట్టులబ్బె నీ
లేతవయస్సు నూరక చలింపఁగఁ జేయఁగ నింగయేల యా
జ్ఞాతజువాత్రితకున్ వగవఁబాడియె వేఁడెదఁ దెల్పుమా దయన్. 125

చ॥ సరసిజపత్రనేత్రముల సారసశాత్రవబింబవక్త్రమున్
గరివరమందయానము మృగప్రభుమధ్యము హేమనాస బం
భరనికరాలకంబులను బాహుగు నారు ఘనస్తనంబులన్
సరసత నీకుఁ గూర్చె విధి శక్యమె నిన్ను నుతింపసుందరీ. 126

గీ॥ అధర సుధఁగోరి నదన్నాభి యందునుండి
కదలి చనుచు వక్షోరుహ కలశములను
గచకలాపముఁ గని భీతిఁ గదలకుండు
నహియనంగ నీయారు పొల్పారు నబల. 127

చ॥ పురహరశూలతీక్ష్ణమును బూనిన శర్మతము ల్మదించి నీ
యురమును జీల్చి పైకొనుచు నుండుఁగదా నను నన్య నోంచుట
చ్చెరువగు నే దయాకలితచిత్తవు లోకములోన నకటా
శరణముగోరుయాచకులఁ జంపఁగఁ జూతురె సుందరీమణీ. 128

చ॥ తరుణిరో నీదువాతెఱసుధారసముం దనియంగఁ గోరిల వే
శిరములు డాల్చనైతిఁ గడుఁజెల్మిని గుబ్బచ్చ కవుంగలింప వే
కరములు నోచనైతి సుమకాండుఁడు కూరిుఁడు పారెపారె వే
శరములు వేసి వేసి గతసారునిఁజేసె ననుగ్రహింపుమీ. 129

చ॥ మాయురె దేవదానవులు మందమంతిం గలశాంబురాశి దీ
ర్ఘాయువుగోరి చిల్కరె మదద్భుతభాగ్యము నెన్నశక్యమే
తోయభవుం డసూయతను గందఁగఁ జేసెఁ జిరాయువందఁగా
నీయధరామృతం బొసఁగి నిల్పఁగరాదె సుధాకరాననా. 130

సీ॥ గోవాంఛ్రము గొనియాడ ఘుమఘుమాయింపక
చూడ సొంపగు జపాసుమముఁ బోలె
దానధర్మాది సత్కార్యవైభవములఁ
దనయని కృపణుని ధనముఁబోలె
విబుధలోకస్తుత్య విమలపాతివ్రత్య
మంచకుండైన రాచయతివఁబోలెఁ
దనపూర్వికులు చాల మనుపంగ నలరిన
వీడుఁ గైకొనని భూవిభుని బోలెఁ
బ్రతిభతోడి యాశుకవిత్వపాటవంబు
ఘనసభలఁ జాటఁజాలని కవినిబోలె
బాపురే నీమతులు విను భాగ్యమొదవ
లేక నాజీవనము వమ్ము మీననయన. 131

గీ॥ విను మొకింత రమాకరవిభువరునకు
శక్తికరుణను గాళిప్రసాదుఁ డనఁగ
జన్మమెత్తెని నని తనచరిత మెల్ల
బాలకు నెఱుంగఁ జేసె భూపాలసుతుఁడు. 132

ఉ॥ నావుఁడు సుందరాంగి నరనాయకనందను వాక్ప్రసంబుసౌ
భావము పల్లవింపఁ బయిపైఁ జొరబూనిన మానమానుచుౌ
భావజరూప వైభవ విభాజితభాస్కర నామ విన్నపం
బీవు వినంగ నౌ ననుచు నింత వచించు సుధ[illegible]ంగొనన్. 133

గీ॥ ఓడ్రదేశంబునకు భూష యొాఱఁ దగుచు
శార్వరీపురినా నిది చాలఁ బ్రబలె
రాజకంఠీరవనృపతి రాజ్య మేలె
నఖిల దక్షకన్యానుత యశ మెసంగ. 134

గీ॥ ఆనృపునకు శంఖస్వనుఁడను యతిదయ
నేను లలితాలతాఖ్య జనించి యుండు
మజ్జనని మునియాడిన మాడ్కిఁ బలికె
నాకు నీవ భర్త వటంచు నయగుణాఢ్య. 135

సీ॥ లోకకంటకుఁడు త్రిలోచనాభిఖ్యుఁడు
గలఁడు రాత్రించర కులవిభుండు
మజ్జనకుం డొక్క మఖ మాచరించుచో
నాయసురుండు రసాయనంబు
గడుఁ బారఁ ద్రాగి యఖర్వగర్వము మీఱ
రక్తలోచనములు రగులుచుండ
ధూమవర్తి నితాంతధూమ మాకస మంటఁ
జరణఘట్టనలను ధరణి గ్రుంగ
శ్మశ్రువృంతము ల్దీటుచు మఖముఁ జేరి
సవనదీక్షారతుని జూచి యవినయోక్తు
లాడఁగా నాతఁ డుక్కెక్కి యట్టివానిఁ
గ్రిందఁ బడవైచి తన్నెను క్షితివడంక. 136

శా॥ మాయం గైకొని కాద్రవేయముల నామాంసాశనుం డుగ్రుఁడై
వేయాటోపఁగఁ జేసె నంత నకటా పవిత్రము ల్గానిని
కాయంబు ల్దిగజాలు వస్త్రములతోఁ గాయంబుపై దృష్టిరే
కాయాదికులఁ బాఱసాఁగిరి భయం బంతంత రెట్టింపఁగా. 137

క॥ మాయాకృతిఁ బూనిన దై
తేయాగ్రణి మామకపిత ధృతిపారు నసిఁగా
మాయించి యతనిశిరమును
హా యధ్వరకుండమందు నఱచుచు వైచెన్. 138

గీ॥ యాగకుండమందు నటుశిరంబును వైవ
భోగినీలలామ నాగనోర్త
పుణ్యజనవధూటి పుట్టె నాచంద్రాస్య
నభినుతింపవశమె యచ్చరలకు. 139

క॥ ఆరాజవదనఁ గైకొని
యారాక్షసుఁ డమితభోగ మందుచు నకటా
యీరాజధానివాసులఁ
గ్రూరత భుజియించె రాజకుంజరతనయా. 140

క॥ లలితాంబాదయ దానవ
లలన నసుం గూఁతుగాఁగ లాలన సేసెన్
జలజాక్షికిఁ దనయాత్రయ
మలర నట జనించి యెదిగె హాశుగలీలన్. 141

గీ॥ అంత రాక్షసకాంత గతాసు వగుడు
యాతుధానుఁడు మము నిందు నధివసింపఁ
జేసి శ్రీజగన్నాథస క్షేత్రమునకుఁ
దపము సేయంగఁ జనియెను నృపకుమార. 142

గీ॥ దైత్యకామిను లధిప మధ్యాహ్నవేళ
లందు నిదురింపుదురు రాత్రులందు మగలు
గూర్కొనినయంత నద్భుతఘోరరూప
లగుచు విహారించుచుందు స్వేచ్ఛానుసరణి. 143

కం॥ ఈగాత్రుసకాంత లతి
క్రూరాత్మలు వీరితోడి కూటమి తనునే
యోరాజతనూభవ నుడి
కారము సేయక మదుక్తి గైకొనఁగఁ దగున్. 144

మత్తకోకిల॥ మానవాగ్రణి చిత్రకేతు విమానమోయను నట్టునై
మానికస్తుతి గాంచు నొక్క విమాన మిచ్చట నున్న ద
ద్దానిపై మనకోరుచోటికిఁ దత్క్షణంబె మనోరయం
బానిపోవఁ జనుం ద్రిలోచనుఁ డందుఁ బోవుచునుండెఁదాన్. 145

కం॥ ఆరక్షోనాథునిసతి
కూరిమిని విమానమంత్రగోప్యము లెల్లన్
దీరుగ నాకుఁ దెలిపె మన
కోరినయెడకుఁ జనవచ్చుఁ గోమలదేహా. 146

కం॥ హృదయేశ దైత్యకాంతలు
నిదురింతురు పగటిపూట నిశియగుదాకన్
గదలరు గావున మన మా
యదనునఁ జనవచ్చు నిచ్చయగు తావునకున్. 147

మ॥ అని మోదంబలరారఁగా నబల యింతాడంగ నత్యద్భుతం
బెనయంగా నతఁ డింతిఁ గాంచి దయితా యేనెంత ధన్యుండనో
నిను మత్ప్రేయసిఁ గాన నోఁచితి నిఁక న్నీయిష్టము న్నిలనే
ర్తునటంచుం దమిఁ గౌఁగిలించుకొని సంతోషాంబుధిం దేలుచోన్. 148

కం॥ ప్రతిదినము వచ్చునట్టుల
హితు లపుడే తేర నృపజుఁ డెలనాగనుతుల్
హితమారఁ బలికి పనుపఁగ
నతులితచాతురిని వార లానసియందున్. 149

క॥ నిమురఁజనినట్టు లయ్యెనఁ
గదలక ముసుకు లిడి యుండి క్షణదాటసతుల్
ముద మూర ఘోరరూపము
లమరెత్తఁగఁ బూని చనుట యటఁ గాంచి రొగిన్. 150

గీ॥ అంత నామరునాఁటి మధ్యాహ్నవేళ
సతులు గూర్కొనుచో విభు సన్నిధికిని
వారు మువ్గురు చనుదెంచి తారు గనిన
వింత యంతయు వినిచిరి వెల్లఁ బోయి. 151

గీ॥ అంత మోములు వాడంగ నంది యధిపు
పాదయుగళంబుపై సోలి పరమచరిత
యింక మన యింట నుండిన నిడుము లౌదవు
నరుగుటయ చూడ మేలంచు నంగలార్ప. 152

ఉత్సాహ॥ జనవరాత్మజుండు వారి జాలి నోలి దీర్చి మా
నినిని గని విలాసినీమణీ మరీన నిప్పుడే
చనుట శుభద మగు ననంగ సతి మహావిమాన మిం
పెనయ జతనపఱిచి వారి నెక్కినట్లు చేసి తాన్. 153

గీ॥ మంత్రమును జపియించి విమాన మెక్కి
జలధిమీఁదుగా గంగపైఁ జని రమాక
రంబుఁ జేరుమా యని వందనంబు సలుప
నదియు నుప్పరవీధిపై నట్టె యరిగె. 154

గీ॥ అది సదాగతి రయమున నబ్ధిమీఁద
నాకసముక్రిందఁ జన మగ లంద ఱంతఁ
గనులు ద్రిప్ప మూర్ఛిల్లిరి కమలనయన
యొడలు మఱచి సంభ్రమంబునఁ బడియె నకట. 155

భుజంగప్రయాతము॥ విమానరాజ మెంతయేని వేగలీలఁ బోయి యా
రమాకరంబు పేరి సత్పురంబు చెంత డిగ్గఁగా
క్షమాధినాథ నందనుండు గన్నుదోయి విచ్చి య
ప్రమోదితాత్ముఁడౌచు నాత్మపత్నిఁ గాన కక్కటా. 156

ఉత్సాహ॥ కన్నుదోయి నీరు గాఱఁగా మొగంబు వాడఁగా
మిన్ను మీఁదఁ గూలినట్లు మిట్టిపడుచుఁ జేతు లా
పన్నుఁడగుచుఁ బిసుకుకొనుచుఁ బదము లట్టె బొట్రిలం
దిన్నగాఁ విమానమందు నిద్రపోవు మిత్రులన్. 157

గీ॥ లేవఁదీసి యడిగె లేమగతి యొకింత
యరయ కేదిడోఁచ కంగలార్చి
వీడువీడు దిరిగె వెంబరపిత్తునాఁ
గామపాశ మెన్నఁగావశంబె. 158

గీ॥ హరిహరవిలాసు నోడించి యడవిఁ దోలి
తత్పురంబును వీరప్రతాపుఁ డేలు
టరసి యామూర్ఖు రతిభీతి నరిగియరిగి
యొండు వనిఁ జేరి రారాత్రి నిండువనట. 159

ఉత్సాహ॥ అంతఁ బొద్దు పొడిచినంత హాసులింతమీఱఁగా
దంతపురవణంబు లలర దంతకాంతి డాల్కొనన్
సంతసమున విల్లునంది శబరకాంత యొార్తయా
చెంతకు నరుదెంచి వారిఁ జీటి వీఁక నిట్లనున్. 160

క॥ మీరెవ్వ రిందువచ్చెదు
కారణ మెఱుఁగింపుఁ డనుడు గజిబిజియగుచున్
వారంతయు నెఱుఁగించిరి
తారు పడిన పాటు లెల్లఁ దగుమాటలతోన్. 161

ఉ॥ చెంతను నిల్చి వారలంతఁ జెప్పుట చెంచెత యాలకించి మీ
రింత శ్రమంబు గైకొనఁగ నేల యటంచును సారపప్పుఁ దా
సంతస మారఁగాఁ గడునొసంగి రమాకరనాథుఁడుంచు వా
వింతవనంబుఁ జూపినను వేడుక నందఱు పోయి రచ్చటన్. 162

గీ॥ ఘనదు భటులచే వీరప్రతాపుఁడు విని
యావిమానముఁ జెప్పించి యంతిపురము
నందు నునిచి కాళీప్రసాదాఖ్యు నరయ
శౌర్యయుతుల భటుల నంపె సకలదిశల. 163

క॥ అలలితాలత వార్నిధిఁ
గూలఁగ శంఖస్వనుందు గూర్మి దలిర్పన్
గూలంబుఁ జేరిచి చనియె
నాలోనం దెలిసి యబల యతిదీనతతోన్. 164

ఉ॥ అక్కట యీసముద్ర తటమందు మదీయ హృదీశుఁ బాసి నే
నొక్కతె యుండఁ గారణ మదేమొ కనంజాల నీశౌటకామినుల్
గ్రక్కున వచ్చి తోసి చనుకైవడిఁ దోఁచెడిఁ గాని వేరుగా
నిక్క మెఱుంగలేననుచు నిందుసునోవ్యథ నంగలార్చుచున్ 165

క॥ మామక మనోధినాథుని
గామిను లేమి యొనరించి కష్టం బిడిరో
హా మాన్దేవి దయారస
మేమాత్రము నిడగనో యంచు నెంచుచు నంతన్. 166

గీ॥ జనకసుతయు సత్రాజిత్తు తనయయును సు
భద్రయును దుర్గదానవ భంజనియును
బ్రబలి రటులేల యేనోర్వరాదటంచు
ధైర్యమును బూని విహరింపఁ దరుణి దలఁచె. 167

చ॥ జలధితటంబునుండి చని శంకరుఁగూర్చి మహాతపంబొగిన్
సలుపు త్రిలోచనాసురుని సారసలోచన గాంచి కోపము
గ్గలమయి యేచ వాసిఘనఖడ్గము గైకొని కాళికాయనన్
దలను గఱుక్కునం దఱిగెఁ దంత్రిబుఱుంబును దీక్ష్ణకైవడిన్. 168

గీ॥ అంత నట జగన్నాథాలయంబు గానఁ
బడుచునుండంగ సంతోషపడుచు నటకు
నంగనామణి చనియెఁ జే నసి దెలంగ
మహిషదానవమర్దని మాడ్కి నార. 169

గీ॥ శ్రీజగన్నాథునకుఁ జోర బృంద మెలమిఁ
గట్నములు దెచ్చి చెల్లించి గాఢభక్తి
నుతులు సేయుచుఁ జనుదెంచు నతివ గాంచి
దుర్గయను భీతిఁ బాఱంగఁ దొడఁగి రకట. 170

శా॥ అంతం జోరవిభుండు ధైర్యయుతుఁ డబ్జాక్షిన్ విలోకించి యీ
కాంతారత్నము కాళి గాదు ధరణీకాంతాత్మసంభూతయా
నెంతే నిక్కమటంచు నెంచి యెదురై యేతెంచి చేమోడ్చి వృ
త్తాంతం బంతయుఁ దెల్పుమమ్మ యనుడున్ దన్వంగి నిర్భీతయై. 171

చ॥ తనదు చరిత్రముం దెలుపఁ దస్కరవల్లభుఁ డాత్మనెంచి కా
మిని చరణంబులంబడి క్షమింపుము తల్లిరొ నీదు తండ్రి సే
విని ఘటకర్ణనామమున విశ్రుతిగాంచెడువాఁడ నాత్రిలో
చనునకు నోడి యాశిఖరిసానువునందు వసింతు నిమ్ముగాన్. 172

క॥ ఓతల్లి నేను నాభటు
లాతతభక్తి మిముఁ గొల్తు మభివాంఛితముల్
చేతోమతి నొనఁగూర్తుము
మాతావున నుండుమమ్మ మాస్వామినిగాన్. 173

కం॥ అని ఘటకర్ణుం డాడిన
విని దేవీదయ మదీయవిభుఁడు జనించెన్
మునిమాట తప్పునే పతిఁ
గనుఁగొను టెటులైనఁ గొంత కాలంబునకున్. 174

కం॥ ఇప్పుడ పోవుట సరిగా
దిప్పాటచ్చరుని హృదయ మెటు లుండు నొకో
యెప్పుడు సమయము గలుగునొ
యప్పుడ చనవలయుననుచు నాత్మఁ దలఁచుచున్. 175

కం॥ ఘటకర్ణుఁ గాంచి మత్పిత
భటుండ వీఁక నాకు నింత భయమేల దయా
ఘటితాత్మ నీవు లెంకివి
దిటముగ వసియింతు నా యదృష్టం బసదే. 176

కం॥ అని వాఁకొని చోరునితోఁ
జనిచని తటమందుఁ దనరు సద్వాసమునన్
దనపెనిమిటిఁ దలఁపున నిడి
యనఘచరిత్ర వసియించె నదనునరయుచున్. 177

కం॥ అంత నొకనాఁ డొక ధరా
కాంతుని తురగంబుఁ బసిఁడి కత్తళము నిజ
స్వాంత మలర ఘటకర్ణుం
డెంతయుఁ గొసిరాఁగఁ జూచి యిఁక వీలువడున్. 178

కం॥ అరుగుట మేలిట నుండుట
సరిగాదని నడికిరేయి సమయమ్మున బం
గరుకవచము నొప్పికతో
ధరియించి త్రినేత్ర భక్తి ధ్యానించి యొగిన్. 179

ఉ॥ అందఱు గాఢనిద్ర చనునప్పుడసింగొని యశ్వమెక్కి యా
నందము దందడింపఁగ వనంబువయిం జని భాస్కరోదయం
బందు సరోవరం బొకఁడు నారసి యందుఁ గృతావగాహనై
యుండమహాతాళినాంబుజహితేక్షణ నాత్మఁ దలంచి మ్రొక్కుచోన్.

గీ॥ సింధుకటకాధిపు సుతులు సింహబలులు
నలువు రాఖేటనోత్సాహ మలరఁ నీఁగి
నీరువట్టు దాహమికి నానీరజాక
రంబు దండకు నేతెంచి రమణిఁ గాంచి. 181

ఉత్సాహ॥ వనజశర విదగ్ధులగుచు వావి నీఁగి యంద ఱీ
కనకనిభశరీర నాదు కాంతయనుచు వాడినన్
విని సతీమతల్లి ధృతిని విడువ కల్ల నవ్వుచున్
వినుఁడు నాదు కోర్కి దీర్చు వీరు నే వరించెదన్. 182

గీ॥ ఈమహాతటాకము నెవ్వఁ డీఁది మొదల
నేగుదెంచునో యాతని నేవరింతు
ననఁగ సుందోపసుందుల యట్టులవారు
వాదులాడుచు నక్కటా యీఁదఁజనిరి. 183

గీ॥ నీటిలోఁ బంతమాడుచు నెగసి నెగసి
యెదురుగట్టునకును వారలీఁదునంత
నాతి సాంద్రగుల్మములను నఱికి నఱికి
తనదు హయమెక్కి పరువిడె వెనుకఁ గనక. 184

చ॥ కవచము దానుదాల్చుటకుఁ గాలములేమికిఁ దత్తరమ్మునన్
యువతి హుటాహుటిం బరువు లొప్ప వనమ్మున నేగి లోకబాం
ధవుఁ డపరాబ్ధి బ్రుంగుతరుణమ్మున నొక్కబిడారుఁ గాంచెఁ గై
రవకరదండమండిత సరస్సు తటమ్మున నింపునింపఁగాన్. 185

క॥ కని చేరం జన వందలు
వినతులుగాఁ జేయి మోడ్చి వీక్షించు నెడన్
ధనవిజిత ధనదుఁడు బిడా
గునాయకుఁడు రాజసుందరుఁడను విభుఁ డహా. 186

క॥ లావణ్యవతీమణిఁ గని
భావజసాయకవిదగ్ధభావుండగుచున్
భావము వెలియిడక యెఱఁగి
కైవారముతో హిమాంబు కలితాంబువులన్. 187

క॥ ఉపహారముగా నొసఁగినఁ
జపలేక్షణ సంతసించి శ్రమవోవ జలం
బపరిమితంబుగఁ గైకొని
యుపకారిని మెచ్చి యతని యుబు సమగంగ. 188

గీ॥ వినుము తల్లి నాదు చరిత్ర విన్నవింతు
వీరఘంటామణియనంగ వీడొకండు
గలదు వీరప్రతాప భూకాంతసుతుఁడు
సూర్యతేజుఁడు పాలించు శుభదలీల. 189

క॥ తనతండ్రి రమాకరపురి
ఘనతఁ బ్రభుత్వంబు సేయఁగాఁ దాను యశం
బును గనుచునుండు నట్టట
ననఘచరిత షేఁవసింతు నార్యాగ్రణిగాన్. 190

గీ॥ రాజసుందరుఁ డనుపేరఁ బ్రబలువాఁడ
నిచటనుండి దినత్రయి నేగవచ్చు
మాపురికి మాకు విందవై మమ్ము మనుము
సకలలోకైకపావనచరిత యనుఁడు. 191

గీ॥ అస్మదీశువృత్తాంతము నరయవచ్చు
వీనిబసనుండదగు నంచు మానసమున
నెంచి వానికి నాశకల్పించు కొఱకు
నాము చరితంబు వినుమని నాతి వలికె. 192

ఉ॥ ఏమి వచించుదాన వణిగింద్ర మదీశుఁడు సంగరంబునన్
హా మరణంబుఁ జెందె నభియాతులు నాపయి రా భయంబునన్
ధామముఁ బాసి ఘోరవిపినమ్ములఁ ద్రిమ్మరి యంబికాదయన్
గామమనోహరాంగు నలకాపతి వైభవు నిన్నుఁ గాంచితిన్. 193

గీ॥ నాకు నింక నీవ నాథుండ వనఘాత్మ
ఘనతరవ్రతంబు గలదు సువ్వె
పసిఁడిచేఁటయందు బహురత్నములు నించి
మొసఁగనగుఁ బ్రతిదిన మొకసతికి. 194

క॥ చలియించని నిష్ఠచెలఁగ
నెలలాఱటు లాచరించి నిను నేఁ గలయన్
గలదాన శక్తిపూజా
ఫలమ్ము వమ్మగునె సుగుణభాసితహృదయా. 195

చ॥ చిలుకలకొల్కి పలుకులకుఁ జిక్కి విశుం డట లోకసుందరీ
తిలకము చిక్కె నీవసుమతీవలయమ్మున ధన్యుఁ డద్దిరా
కలఁడె మదీయపుణ్యము నిఁకంగొనియాడఁగ నాకు శక్యమా
కలధనమెల్లఁ బోయినను గామినిసాటియె యంచు నుబ్బుచున్. 196

క॥ బిబ్బోకవతీరత్నముఁ
దబ్బిబ్బుగఁ జూచిచూచి తడఁబడుచు సతీ
యిబ్బిపడఁతి సరిదూఁగుదు
వబ్బా నీమాటఁదోఁచియు నంత జడుఁడనే. 197

క॥ నీయిచ్చవచ్చినట్టుల
నాయింటిని నుండవచ్చు నాచేఁ బనులన్
జేయక చేకొనవచ్చును
నీయది నాభాగ్యమెల్ల నీదయ యంబా: 198

క॥ అని సన్నుతిఁ బలికి యతఁడు
దన మేడకుఁ దోడితెచ్చి తగునెడ వాసం
బొనరింపఁ జేసి వ్రతమున
కును వలసిన వస్తువితతిఁ గూర్చుచునుండెన్. 199

క॥ లలితాంబికఁగూర్చి వ్రతము
లలితాలత సేయఁ దొడఁగి లాలితరీతిన్
గలుము లిడుటయు సౌబగుని
పలరఁగ విని సూర్యతేజుఁ డంగనఁ గనఁగాన్. 200

గీ॥ ఆశపడుచుఁ దనకు నతివలఁ దార్చెదు
వృద్ధవిప్రసతికి వేడ్క లూగఁ
దనముకోర్కె దెలిపి యనుపంగ నాతాపి
కత్తె పిశునిబసకుఁ గడక నేగి. 201

క॥ లలితాలతఁ గని యాయమ
కలుములొసఁగ నంది సెలవు గైకొని ధాత్రీ
తలనాథుఁ జేరి నృపతీ
లలనామణి సోయగం బలవియే పలుకన్. 202

క॥ సురుచిర సురూపయగు నా
తరుణీమణిఁ జూచిచూచి తరుణీమణులే
విరహంబున గ్రుస్సుమ రనఁ
బురుషుల సెకఁ జెప్పనేల భూపవతంసా. 203

క॥ వనితా సొబ గిట్టు లట్టులని
వివరింపఁగ నేల బాల వీక్షించినచోఁ
బువువిల్తుఁడు రతిని విడిచి
పువుబోఁడికిఁ బనులు సేయఁ బూనఁడె భూపా. 204

చ॥ కమలములన్ విలోచనయుగంబునఁ జంద్రు ముఖంబునందు భృం
గములఁ గచంబునన్ దరముఁ గంధరమందు జపాసుమంబు నో
ష్ఠమున రద ప్రదంబులను జక్రములం జనులందుఁ దాల్చి నా
రమణి లభించెనేని నృప రాజ్యము గీజ్యము నీకు లక్ష్యమే. 205

గీ॥ నాము చతురత మీఱంగ నళిననయన
నెట్టులేనియు నీకడఁ బెట్టుదాన
నంత నీఁగియుండుము ధరా కాంత యనుచు
నతని నోదార్చి ప్రతిదిన మతివకడకు. 206

గీ॥ చనుచు మాయలు పన్నుచుఁ జనువు చేసి
రాజు కోరిక నెఱిఁగింప రాజవదన
హర్షమందినట్లు నటించి యమ్మ వ్రతము
తుదదినము రాత్రిఁ గాళికాసదనమునకు. 207

గీ॥ చనుమఁగాన రాజును రహస్యంబుగాఁగ
గుడినిమండంగఁ జేయు మేఁ గొన్నిమాట
లతని నడిగి యీఁకొను నేని హర్మ్యమునకు
నందునుండి యాతని వెంట నరుగవచ్చు. 208

క॥ విను మమ్మ శుక్రవారం
బున వ్రతము ముగియునుగాన భూపవరంబున్
గొని తెమ్ము కాళికాలయ
మునకు ననుఁడు వృద్ధకాంత ముద మేపారన్. 209

ఉత్సాహ॥ నరవరేణ్యుఁ గాంచి నవ్వి నాదుప్రతిన చెల్లదే
తొరగఁ గాన్క దెమ్ము లెమ్ము తోయజాక్షి నినుఁగనన్
గరము గోరియున్న దనఁగఁ గమలనేత్ర యప్పుడే
యరుగుదెంచి నట్టులాతఁ డదరిబెదరి లేచెఁ దాన్. 210

ఉత్సాహ॥ అంత ముసలిబాపనమ్మ యడుగులకును మ్రొక్కి య
త్యంతహర్షమంత యంతయలర నేమియేమి యా
కాంత నెట్లు సమ్మతింపఁగా నొనర్చినావు నీ
జంతతనము గలుగ దహహ జగతి నంచు మెచ్చుచున్. 211

క॥ ఆరామకుఁ గంతపరి
షాత్కారముఁ దక్షిణమొసంగి సతి యేమి యనెన్
గూరిమి దెల్పుమని నృపుఁడు
సారెకు వేఁడఁ జెలునవ్వు సంధిల్ల మఱిన్. 212

గీ॥ ఆఁకె వాఁకొను వినుము లోకైకచరిత
వనితనోము ముగియు శుక్రవారమునకు
నాటిరాత్రిఁ గాళికి మ్రొక్క నాతి వోవు
నీవు గోప్యముగ నటకు నేగుదెమ్ము. 213

మ॥ అనిధాత్రీసురకాంత పోయినను గోత్రాధీశుఁ డానాఁడు వై
శ్యనిరాపించి యొకండు కార్యమిడె నార్యుం డొండు వాక్రువ్వ కా
పనిఁ దాఁ జింత నహర్నిశల్సలుపుచోఁ బంకేజపత్రాక్షి కా
ళిని గొల్వంజని యంమతేనిఁగని యో లీలాలతాంతాయుధా. 214

చ॥ నను విడనాడనంచు నిట నాయెమటన్ జగదంబ మ్రొక్కి వాఁ
కొనుమన ఖడ్గమున్ దిగిచి గొబ్బున నాతఁ డొకింత వ్రాలి మ్రొ
క్కిన నసిదూసి రాజుతల క్రిందఁబడం దెగ నేసి రాజనం
దన యతి భక్తిఁ గాళికిఁ బ్రణామము సేసి సుఖించె నెంతయున్. 215

గీ॥ అంతఁ గాళి ప్రసన్నయై యంబుజాక్షి
ధృతికి భక్తికి మెచ్చితిఁ బతినిగూడి
పరమభోగంబు లనుభవింపంగఁగలవు
కవచఖడ్గంబులను బూని ఘనతఁ జనుము. 216

క॥ లలితాలత తావకపతి
కలగని నటులే చనుఁ దనకు కటకమువార
ట్లలరుమరు నీవు మామకుఁ
గలుగును రాజ్యవిభవంబు కళ్యాణగుణా. 217.

క॥ అని వజ్రతనుత్రంబును
ఘనఖడ్గము నొసఁగఁ గాంత కౌతుక మెసఁగన్
జనపతి తురగముఁ బైకొని
చనెఁ గాశీపురముఁబట్టి సత్వరితగతిన్. 218

చ॥ చనిచని కాశికాపురిని జంద్రనిభాస్య ప్రవేశమై ప్రశాం
తిని జలకంబులాడి పరదేవిఁ దలంచుచు నుండి వల్లభుం
గనుఁగొనఁగా రమాకరముఁ గాంచు నభీష్టతఁ బోవుచో భటా
ళిని నురుఖడ్గకార్ముక శిలీముఖము ల్ధరియించి రాఁగనెన్. 219

క॥ వీరప్రతాప భటులగు
వారు పురుషవేషమునను వచ్చువలంతిన్
దూరముననుండియే కడు
వారసి కాళిప్రసాదముఁ దనుభ్రమగొనుచున్. 220

ఉ॥ శూరత మీఁద వచ్చినను గోమలి ఖడ్గకళాప్రవీణతన్
వారిని వారి యశ్వముల వారక నేలఁబడంగఁ జేసి యా
వారి నొకండు పాటినను వాసపయిం జన వాఁడు నమ్రుఁడై
కారుణికాగ్రగణ్య నను గావుము దీనుఁడ నంచు మ్రొక్కుచున్. 221

సీ॥ నేను వీరప్రతాపభూజానిభటుఁడ
హరిహారవిలాసనందను నరసి పట్టు
కొనఁగ మేము దేశములందుఁ గుమ్మరుచును
మిము నతనిగాఁగ భావించితిమి నృపాల. 222

సీ॥ అనవుఁడు హరిహర విలాస జనవరేంద్రుఁ
డెచట నుండునో యచ్చోటు నీవు చూపి
తేని నినుఁ బ్రాణములతోడ నేను విడుతు
ననుచు వాఁడు ద్వారిసిజూప నరిగె నతివ, 223

సీ॥ సచివమిత్రబాంధవసతీసహితుఁడగుచుఁ
నపదు నతినిర్ధ సలిపెడు తనదుమామ
నంతఁగని లలితాలత యధికభక్తి
వినతి యొనరింప నతఁడు దీవెనలొసంగి, 224

ఉ॥ రాజకుమార యేపురవరప్రభుసూనుఁడ వొంటిగా వనీ
రాజములం జరించుచును రాగతమెయ్యెడి దెల్పుమాయనన్
రాజనిభాస్య నమ్రత పిరాజిల రాజకులేంద్రుఁగాంచి యో
రాజితతేజ నత్రి బవరమ్మునఁగూల్చి త్వదీయరాజ్యమున్. 225

క॥ జగదభినుత్యంబుగ శ్రీ
జగదీశ్వరి కరుణఁ గూర్పఁ జనుదెంచితి నె
వ్వగ నీఁగి పురికి రమ్మా
నగ నమ్మ జయించువారు ధర లేరు సుమీ. 226

క॥ అని నృదుసాధుహోక్తుల నా
జననాథునిఁ బలుక నతఁడు శౌర్యోద్ధతుఁడై
తనవారితో రమాకర
మునకును విచ్చేయు జతనమున నున్నయెడన్. 227

గీ॥ అరమాకరపట్టణమందునుండి
పౌరు లొక కొంద అరుదెంచి పార్థివేంద్రు
నకు బహూకృతు లొసఁగుచు నతు లొనర్చి
యపరిమిత మోద భరితాత్ము లగుచు ననిరి. 228

గీ॥ స్వామి వీరప్రతాప భూజాని సుతుని
వీరఘంటామణీపురీవిభుని సూర్య
తేజు నొక సుందరీమణీతిలక మంచి
కాలయంబున ఖండించె నద్భుతముగ. 229

క॥ వీరప్రతాపుఁ డది విని
వారని వగ మృతినిఁజెందె వసుధాధీశా
మీరరుదెంచి ప్రభుత్వం
బారూఢతఁ జేయవలయు నని వేఁడి రొగిన్. 230

గీ॥ అంత నందఱతో హరిహరవిలాసుఁ
డాత్మనగరంబునకుఁ బోయి వ్యాసపార్ష్ణి
వను బ్రభుత్వంబు గైకొని మహి నుతింప
విభుత నెగడించె రఘువంశవిభుఁడనంగ. 231

క॥ హరిహరవిలాసుఁ డట సుతు
నరయఁగ నానాదిశలకు నాత్మభటాళిన్
గరమాదరించి యనిపెం
దరమా సుతువిడిచియుండ ధరణీశునైనన్. 282

క॥ లలితాలత పురుషాకృతి
లలితాంబిక నెల్లపుడు దలంచుచు నట భూ
తల నేత చాల మనుతఁగఁ
నలరెం బతిగనుట యెపుడొ యను కోరికతోన్. 233

సీ॥ ఆశార్వరీపురి నారాత్రుసాంగన
లానాటి సాయంత్ర మందు లేచి
తమభర్తలఁ గనక తడఁబాటు నొందుచు
నిది యేమిచిత్రమో యెఱుఁగమనుచు
లలితాలత వసించు నెలవునఁ జని యామె
నాయమ పెనిమిటి నరయలేక
యచ్ఛాదనముతోడ హర్మ్యంబు నంతయు
నింతుజాగ్రతఁబూని నెమకి నెమకి
పరవిమానము లేమికి వగచి వగచి
యక్కటా లలితాలత టక్కుఁ బన్ని
యందఱను దోడుకొని పోయెనని తలంచి
యాయుబుసు నీఁగి చెలఁగి రిష్టాను సరణి. 234

చ॥ మరునకు నోడియంతట నమందరతేచ్ఛ నిశాటకామినుల్
నిరతతపంబులందగు మునిప్రకరంబు నయోముఖక్రియం
బరుషతఁ బట్టి పైకొనుచు మత్తతఁ గ్రుమ్మరుచో తృణప్రభా
కరుఁడను సుందరాంగుఁడు నికాముఁడు కాంతలు తన్నుఁబట్టినన్. 235

గీ॥ చరణతాడితభుజగరాజంబువోలె
నలిగి దండమునను వాండ్ర నలుగఁ గొట్టి
మానసమున నీల్గుమ రటంచు మఱిశపించె
గాధిజుఁడు రంభఁ దిట్టినకరణిఁ దోఁప. 236

గీ॥ అంత నల్లద్రాగుడు ముండ లింతవంత
నాత్మసదనంబునకుఁబోయి వ్యాసపార్ణి
మాఖ్య సద్దివసంబిదె యరుగుదెంచె
వరతపముసేయు పితఁ గనవలయుననుచు. 237

క॥ ప్రతివత్సర మీగునటుల
కుతుకమునఁ దపోవనమునకుం జని కట్టా
గతగర్వుఁడై పడియుండిన
పితఁ గనిరి నితాంతదుఃఖపీడితలగుచున్. 238

క॥ ఘోర హయగ్రీవామర
వైరింమ్రుచు రక్తబీజ వజ్రకవచర
క్షోరమణులు నీసరియే
గైరికగిరిధైర్య సకలకర్బురవర్యా. 239

క॥ అకటా మధుకైటభ సో
మక మాతంగ వృషభ వృక మహిషాసుర తా
రక ఘోరపద్మ దుర్గ క
నకకశ్యప ముఖులు నీఘనతఁ గాంత్రె పితా. 240

గీ॥ కాలకేయులఁ ద్రిపురరాక్షసుల వృత్ర
బలి జలంధర దశముఖ బాణముఖులఁ
బోర నడఁచు నీశౌర్యంబు బ్రుంగె నకట
దైవకృత మాప నెవ్వారితరము ధరణి. 241

క॥ అని వాపోయి తపోని
ష్ఠనున్న యాతనిఁ బురుషులు చంపుదురే భా
మిని యొకతనడికె నిక్కువ
మని యెంచుచు దీర్ఘదృష్టి సరసిరి నిజమున్. 242

క॥ పలుగాకి రాచబొట్టియ
లలితాలత త్రిగుబోతులంజె మన పితన్
దలఁ దఱిగి చంపి పోయెం
జలమున నాగుడిసెవాటిఁ జంపఁగవలయున్. 243

ఆ॥ మనల మోసపుచ్చి మనవిమానము మీఁదఁ
జనుట గాక యింత పని యొనర్చె.
రాచబిడ్డయనఁగరాదు దానిని జంపి
మనము దీని మనము దినఁగవలయు. 244

ఆ॥ చెనఁటిముండ రమాకరమనుపురమునఁ
బురుషవేషంబుఁబూని కాపురము సేయుఁ
గాన దాని కావర మాపి కసిమసంగి
యారగింపంగ నగునని యాతుగణంబు: 245

కం॥ పటువేగమున రమాకర
పుటభేదనమునకుఁ బోయి భూరిరవము ది
క్పుటలిచెదరఁ జేసిరి తమ
కుటిలత్వపు మాయమేటి కోటగఁ గలంచన్. 246

ఉ॥ మాయలనెన్నియేని సగమంబు భయంబునఁ దత్తరింపఁగా
మాయురె వారు పన్నినను క్ష్మావరుఁడేమి విచిత్ర మిద్ది దై
తేయుల చెయ్వులంచు సతిదీనతదోఁపఁగ నొంటి కార్యముం
జేయఁగఁ జాలకుండెఁ దన సెజ్జపయిం గనుమూసి మూర్ఛచున్. 247

కం॥ లలితాలత యయ్యదిగని
చలమున రాక్షసవనితలు చనుదెంచి రిఁకన్
గలన మొనరించి వారల
తులవదనము మాన్పెదనని తోరపుటలుకన్. 248

కం॥ చనుదెంచిన లలితాలతఁ
గని కౌతుక మినుమడింపఁగా దైత్యసతుల్
మినుకులరు తమకత్తులు
గొని పోరొనరించి నేలఁ గూలిరి యొకటన్. 249

క॥ ఆవిక్రమంబు నరసి యి
లావిభుఁ డరుదెంది వేడ్క లలితాలతఁ దా
వేవే విధములఁ బొగడుచు
నావీటిని నుత్సవంబు నలరఁగఁ జేసెన్. 250

ఉ॥ ఆరజనీచరప్రమద లట్లు గతించిన నాఁడు రాజకం
ఠీరవుఁ డౌర లోకజననీకరుణాంగలనుండి లేచు నా
తీరున లేచియుండెన్ను గతించిన యొల్లరు నావితాన నిం
పారఁ జెలంగి రా నగరమంతయు శోభిలె నాకమోయనన్. 251

క॥ మునుపటిపోలిక రాజ్యము
నను ముగఁ బాలించుచును నిజాత్మజ నచటన్
గనలేక వందురి యతఁడు
దనకూఁతుఁ గనంగఁ గోరి తగఁ జాఁటించెన్. 252

గీ॥ రాజకంఠీరవుని చేత రాణమీఱి
శార్వరీపురి మరలఁ బ్రశస్తిఁ గనుట
తద్విభుఁడు పుత్రి నెమకుట దా విని యట
వచ్చె ఘటకర్ణనామ పాటచ్చరుండు. 253

క॥ ఆతస్కర వరుఁ డాపురిఁ
జేతఃప్రమదమునఁ జేరి క్షితిపతిఁగని పు
త్రీతిలకము చారిత్రముఁ
జేఁతులు జోడించుకొనుచుఁ జెప్పె విరివిగాన్. 254

గీ॥ అందునకు నప్పుతానంద మంది యాతఁ
డాత్మ సతికిఁ గాంతిమతికి నదివచించి
నిఖలదేశంబులకు భటానీక మనిపెఁ
దన కుమారీమతల్లి వృత్తాంత మరయ. 255

గీ॥ తనదు ప్రేయసిఁ బాసి నితాంతచింతఁ
పురము పురము వెంబరవిత్తుఁబోలెఁ దిరిగి
ధూమపురిని గాళిప్రసాదమందు చేరె
నకట కాఁదారి మాఁదారి యదనునందు. 256

గీ॥ నడికిరేయిని మఱియొందు కడకుఁ జనఁగఁ
జాల కాతఁ డొండొక యింటి జగతిమీఁదఁ
దనదు శ్రమ యింత దీఱ ముదంబు మీఱ
విశ్రమించి యెంచుచునుండె విధికృతంబు. 257

క॥ అతఁడున్న యింటి యెదుటను
క్షితినాథు పురోహితుఁడు వసించు నతనికిఁ
రతియనెడి భార్య గల దా
యతివ కులటలందు మిన్నయగుచుఁ జెలంగున్. 258

క॥ ఆపుటభేదన మేలెడు
పాపాంబుధిమంథరుండు పక్షాత్ముఁడు త
ద్రూపావతి నుంచుకొనియె
రూపాజీవలకు బ్రమకు క్రుంగుచునుండన్. 259

గీ॥ ప్రభుపురోహితుండు రామేశ్వరాహ్వయుఁ
డొక్క భోయముండ నుంచుకొనుచు
రేయి పగలు దాని గృహమందు నెలకొనెఁ
దనదుసతికి మోద మినుమడింప. 260

చ॥ అతిరమణీయరూపయగు నారతి భూపతి పంపు వస్తు సం
తతి గొనితెచ్చు నౌకరులఁ బ్రచ్ఛన లాడుచు సానివృత్తిగాఁ
జతురత మెంతయున్నెఱపుఁ జాఁకలివాఁడొకఁ డిష్టజారుఁడై
ప్రతినిశయందు వంటగదిపంచ రహస్యముగాఁ జరించఁగాన్. 261

గీ॥ అరుగుమీఁదఁ గాళిప్రసాదాఖ్యుఁడున్న
రాత్రి మధుపానమత్తుఁడై రజకుఁ డకట
రతిని వీధికిలాఁగి క్రూరతను గొట్టె
మేదినిని జారపతిపోటు మెండుగాదె. 262

క॥ రతియంత గంగుకానిని
బ్రతిమాలుచు నిట్టునట్టు పరికించుచు భూ
పతి సుతుఁ గని వీఁడిఁక నా
గతి వెలి నిడు నంచు నెంచి కడుఁ దడఁబడుచోన్. 263

గీ॥ వేఁటకుం బోయియున్న యుర్వీశ్వరేంద్రుఁ
డపుడు రతిఁజూచు నభివాంఛ నచటరాగ
నతివ తడఁబాటునొంది ధైర్యంబుఁ బూని
నృపతి సత్కరించి వచించు వేడ్కతోడ. 264

చ॥ ధనదకుమారరూప నినుఁదక్క మతెవ్వరిఁ దాఁక నంచుఁ బూ
నిన వ్రతమూడి పోవ నొక నీచుఁడు నీ రిడు మంచు వచ్చి ర
మ్మని వినకున్న లాఁగినను నక్కటకొట్టుచు నుండె నీవు రాఁ
గని మొఱరింటితిన్నెపయిఁ గ్రచ్చఁబాటి పరుండుఁ జూడుమీ. 265

గీ॥ అనుచు మడివాలుగొట్టిన యట్టిదెబ్బ
లొడలినంతట దద్దులై యుంటఁజూపి
వామ బ్రతుకేల నీవంటి నాథుఁడుండి
యిట్టి యిడుము లొందితినని యేడ్చె నింతి. 266

గీ॥ అంత నవసింహుఁ డమితాగ్రహంబుఁ బూని
యా రెకులఁ బిల్చి యా హరిహర విలాస
తనయు బంధింపఁగాఁ జేసి తరుణిఁ గ్రుచ్చి
కౌఁగిలించి యోదార్చి నగరునకుఁ జని. 267

కం॥ తెలతెల్ల వారునంతట
హాలధరుఁడను మంత్రిఁ బిలిచి యానిసి యుబుసున్
బలికి నతికింపుము మహో
ఖలునని యాజ్ఞయిడ నతఁడు గ్రైమోడ్చియనుఁగా. 268

కం॥ కరుణించి వినుము భూపా
తరుణులమాయ లరయంగఁ బరమా విధికిన్
బురుషులు మాహాత్ములగుట
పరిపరిభంగులను మాయఁ బన్నుదు రతివల్. 269

గీ॥ తమకు నొక్కనిపై నిష్ట మమరునేని
వాని నింద్రుఁడు చంద్రుఁడుగా నుతింత్రు
తమకమూడిన యంతఁ బంతంబుపట్టి
వానికిని హానిఁగావింత్రు వనితలధిప. 270

గీ॥ మూలమాదిగలది కాని మానహీను
లనుచుఁగాని తలఁచరు దృఢాంగధనులఁ
గోర్కెలూరఁ గులీనలు గూడుచుంద్రు
ప్రాణహానికి నింతేని భయముపడక. 271

గీ॥ తాము పిలువంగరాని యుత్తమగుణాఢ్యు
వేరొకరుచూడఁ బిలుచు వివేకహీనుఁ
బరపురుషుఁ జేరునెడఁజూడు కాటసారి
నకట యల్లరిచేయుదు రసతు లధిప. 272

చ॥ జనవర పాంథుఁ డక్కట నిశాసమయమ్మునఁ బ్రోలిఁ జేరి యుం
డును ద్విజకాంత యయ్యది గనుంగొన కొండొక జారుతోడఁ ద్ర
ప్పన లొనరించియుండు నని చాటునటంచుఁ గుయుక్తిఁబన్ని వా
నిని దొంగటంచుఁ జూఁచు నిది సిద్ధవమంచుఁ దలంపఁగాఁ జనున్. 273

చ॥ అనవుడుఁ గోపగించుచు మదాజ్ఞను దాటక తత్క్షణంబె క్రూ
రుని నఱికింపు మంచు నవరోధముఁ జేర నరేంద్రుఁ డేగ నా
వనితలపై విరాళిగొని వారక మ్రగ్గెడువారు కామినీ
జనముల నీచకృత్యములఁ జాఁటిన నష్టరదేమి మాయయో. 274

గీ॥ అంత మంత్రి భటులఁ బిల్చి యడవియందు
వీనిఁ బోవిడిచి నృపాలుతో నఱికితి
మని వచింపుఁ డనఁగ వార లాయమాత్యు
మాట జవదాట కటు చేసి రోటరేక. 275

గీ॥ వారు వనమున విడిచిపోవంగ ఖిన్నుఁ
డగుచుఁ గాళిప్రసాదుఁ డాయడవియందుఁ
దిరిగితిరిగి యొండొకదారి నరిగి యరిగి
నందనగరముఁ జేరె నానందములర. 276

ఉ॥ అంగజసన్నిభాంగుఁ డతఁ డంతటఁ దన్నగరీతటాకఘా
రాంగమునన్ శ్రమంబొగిఁ దురంగతురంగదయానుభూతిఁ బో
వంగ వసించె వారిరుహవారములన్ శఫరీకుళీర చ
క్రాంగములం గనుంగొనుచు రమ్యతరాంబువిలాస మెన్నుచున్. 277

గీ॥ ఆకుశేశయంబె యాపట్టణమునకు
సారవంతమగుట చానలెల్ల
నీరుగొనఁగ నటకు నిత్యమేగుచు నుండ్రి
ఘనఘటంబు లందుకొనుచు వేడ్క. 278

గీ॥ నంద నగరంబు నేలు చంద్రముఖయనెడి
రాణికిని నర్మసఖియైన రాధికయను
ముఖ్యదాసిగా నడయాడు మోహనాంగి
జలముగైకొన వచ్చె నాసరసునకును. 279

సీ॥ ఆకర్ణదీర్ఘనయనయుగ మింతింత
యింద్రనీలమణులకీనినుచుండ
లావణ్యలీలాజలమ్మునఁ గుచచక్ర
వాకము లుప్పొంగి పైకిమూఁక
వడఁకునడుము వీడిపడునని బిగియించి
నట్టి యొడ్డ్యాణ మంతంత వెలుఁగ
మగలు పదరజస్సమానులనెమమాడిఁ—
టింగుటంగుమని మట్టియలు మ్రోయ
బింబికాఫలచ్ఛాయావిడంబమాన
లాలితాధర రసమును గ్రోలుకొనుచుఁ
జెలులతోఁ గేరడములాడి చిలికినగుచు
దేహజుని ఘోటి గున వచ్చె మోహనాంగి. 280

గీ॥ మోహనాంగి యట్లేతెంచి మోహనాంగు
నృపసుతుని గాంచి తమిగొని నీరుగొనుచు
నగరికిని బోయి పాంథుని సొగసు రాధి
కకును విన్నవించెను వరాంగము చెమర్ప. 281

ఉ॥ దిచ్చరి మేలుబంతియన దింతిమలాడుచు నూలునీరులన్
దొచ్చెపుముండ లూఁకొనఁగ దూఁకఁగఁ జేయుచు నంతురాణికిఁ గా
నిచ్చలు మేలుకాంద్రగమి నేర్పునఁ గూర్చెదు రాధికాఖ్య మే
లెచ్చఁగ మోహనాంగి నుదురెంతయుఁ దావిని తొట్రుపాటులోన్.

చ॥ చని విరిసెజ్జపైఁ బొరలు చంద్రముఖింగని యానువార్త వాఁ
కొని సెలవంది పాంథుఁ దగఁ గోటకువచ్చు వితానఁ జేసి యా
తనికిని గావిబట్టలు ముదంబునఁ గట్టుకొనంగనిచ్చి ప
న్నని తను దెంచెనంచుఁ బురి మ్రోయఁగఁ జేసెఁ బ్రజల్ బ్రమింపఁగాన్.

కం॥ లలితాలత తలఁపునఁదగ
నిలాధినేతసుతుఁ డందు నింత వసించెన్
ఖలువితముల గాసినిబడి
నలిగిన తనమెయి యలఁత యణంగునటంచున్. 284

తరల॥ వలపు దూఁకఁగఁదాళఁ జాలక వట్టి కోరికలూరఁగన్
గులుకుగుబ్బలమీఁది పైఁటను గోటుగా దిగజార్చుచుం
జిటికినవ్వుచు వింతమాటలు సిగ్గు నీఁగి వచించుచున్
ఫలములం గొనితెచ్చి యిచ్చుచుఁ బైఁబడన్ గమకించుచున్. 285

ఉత్సాహ॥ కులుకులాడి మోహనాంగి గ్రోవతనము రేఁచఁగా
బలిమి నట్టె కాఁగిలింపఁ బార్థివాత్మజుండు ధీ
తొలఁగుమంచుఁ గ్రిందఁ బడఁగఁ ద్రోసి తిట్టె నల్లవో
కులవధూటిఁ దక్కఁ బనునె గుణవిభాసితుం డిలన్. 286

కం॥ ఆసార్వభౌమతనయుం
డాసరణి దయావిహీనుఁడై తనుద్రోయన్
హ్రీసన్నశిరోధియగుచు
నీసున వెస మోహనాంగి యిక్కకు నేగెన్. 287

ఉత్సాహ॥ దాఁగియుండి యద్దిగనిన దాసి యొూర్తు ధూర్తయై
వేగ పోయి రాధికకును వేడ్క మోహనాంగి నా
యొగి పెట్టినట్టి పాటు నుగ్గడింప నగుచు నా
త్రాఁగ చంద్రముఖికి నాతెఱంగు విన్నవించెఁ దాన్. 288

కం॥ ఆరాణి యానుడులు విని
మారాకారుండు నాదు మాట గొనఁడొకో
యారా మన మొకటిదలఁచ
వేరొకటి యాయెనను చు వెలవెలఁ బాఱెన్. 289

ఉత్సాహ॥ ప్రతిదినంబువోలె నాటిరాత్రి మధువుఁ దాగిరా
　　యతివ తప్పటడుగు లిడుచు యతియనంగనున్న భూ
　　పతిని నూజు డాసి కదియఁ బట్టి కౌఁగిలించెనా
　　యతనుఁడలుకఁ బూవుటలుగు లదిమి యదిమి చొనుపఁగాన్.　　290

క॥ కపటయతి రాణి యాఁగతి
　　నుపగూహన మాచరింప నుల్లం బెరియన్
　　జపలాత్మ పొమ్ము పొమ్మిటు
　　లెపు డొనరింపకుమటంచు నిలఁ ద్రోసెన్.　　291

ఉత్సాహ॥ భూపసుతుఁడు మెట్టఁ ద్రొగుబోతు లంకుముండ బ
　　లోపమూని బింతబడికఁ గొట్టికొట్టి మార సం
　　తాపమారఁ దనను భటులఁ దగిలి నిద్రపోయినం
　　దాపికత్తె రాధిక తనుఁ దగలఁ జితఁ డటఁచుఁదాన్.　　292

ఉత్సాహ॥ చిన్ననాటితనమునందు సిద్ధుఁ డొకఁడు దనకు మే
　　లెన్ని నేర్పినట్టి మంత్రమెంతయును జపింపఁగా
　　మన్నెపట్టి యాంత్మణఁబె మంత్రమహిమఁ జిలుకమై
　　చిన్నతెన్నుఁబట్టి పాతె విధికృతంబు పాయునే.　　293

గీ॥ రాజనందనుఁ డాగతి రామతన్మ
　　రూపుగొని పాటి పాటి గౌరీపురంబు
　　నందు ఫలతారామమధ్యమున వ్రాలి
　　నడబెడంగుచునుండె నై బెఱఁగు లడర.　　294

క॥ గౌరీపురిని ధనాఢ్యుఁ
　　డారుండు విభుండు రత్నపాలాహ్వయుఁ డే
　　పారు జగన్మోహిని యను
　　వార స్త్రీరత్నమునకు వశుఁడై యకటా.　　295

తరల॥ ఇనులు ఛీకొనఁ ద్యాగభోగములెట్టివో కన కూనికం
దనదు పెద్దలు గూర్చిపెట్టిన ద్రవ్యమంతయు సానికిం
దనివి దీఱ నతం డొసంగుచు ధర్మపత్నిఁ బతివ్రతం
గనులపండువుగాఁగఁ జూడక తావరమ్మునఁ ద్రిమ్మరుఁగా. 296

క॥ కులదూషణుఁడగు వైశ్యుని
కులసతి మణిమాలికాఖ్య కుందుచుఁ జెలితో
నెలదోఁటనుండి హరిహర
విలాసజుఁడు శుకముగాఁగ విహరింపంగన్. 297

చ॥ కని యిది క్రొత్తచిల్క మును గాన్న మహోరె శుకంబులంగనుం
గొన మొకఁ యింత డాల్గలిగి గోటనుజూపెనె యెట్టులేని దీ
నిని గయిఁబట్టుకొమ్మనని నేర్పలరారఁగఁ బొంచిపొంచి పై
కొని చెఱఁగేసిపట్టుకొని గొబ్బున నొండొకపంజరమ్మునన్. 198

తే॥ పదిలపఱిచి తియ్యని మంచిపండ్లనెల్లఁ
దనివి పడఁగ నొసంగుచు దాని నెలమిఁ
దనదుబిడ్డగా భావించి పెనుపసాఁగె
మగని పైనున్న వెసనము మఱఁగిపోవ. 299

తే॥ ఆపురము నేలు వృకకేతుభూపు సుతుఁడు
దండకసముఁడు కాలమేఘుండు రత్న
పాలుసతి మణిమాలికఁ బడయఁ గోరి
మంత్రసాని నోర్తనిపె మగువకడకు. 300

క॥ ఆతార్పుకత్తియ వణి
జ్నేతబసకు నేగి యింటిని గనుంగొని యూ
యూతగునీతులను బలికి
భూపాలపతివయుకోర్కెఁ బొలుపుగఁ దెలిపెన్. 301

క॥ అటువాఁగొని యమ్మా రేఁ
పటిదినమునకు వరుదెంతు బదులీఁదగుహృ
త్పుటమున నిడుకొనుమని తన
కుటీరమునకుం గిరాతి కుతుకమునఁ జనన్. 302

ఉత్సాహ॥ హా యదెంత పలచనైతి నస్మదీయ పతి ననుం
బాయుటింతవచ్చె తేనెపట్టి వజ్రమింతుఁడే
చాయ నేసలిత్వ ముడుగఁ జాలుదాన ననుచు డో
లాయమానమానసాబ్జ యగుచునబల యుండుచోఁ. 303

సీ॥ తాపికత్రియవిచ్చేసి తగవినుచుట
వినుచునుండిన కీరము మనుజమధుర
వాక్యలను మణిమాలిక వంకఁజూచి
యల్లనల్లన నిటులాడె నామె వినఁగ. 304

క॥ అమ్మా మొగమ్ము వాడఁగ
నిమ్మాడ్కిని నొగలవేల గృహిణికి గుణమే
సొమ్మనుచుఁ బురాణమ్ములు
కమ్మగఁ జాటుఁగద యోర్పు గైకొని విన్నమా. 305

క॥ పాతివ్రత్యం బందిన
నాతికిని త్రిమూర్తులే మనంబసియాడన్
భీతిల్లుచు నుందురు రన
లాఁతిని బలుకంగనేల లావణ్యనిధీ. 306

క॥ జనుపాంధుఁడైన వార్ధక
మునమునిఁగినఁ బంగుఁడైన మూర్ఖుండైనన్
ఘనరోగార్తుండైనను
దనపతి నతిభక్తిఁగొలువఁ దగుసతికి సతీ. 307

కం॥ కలకంఠకంఠి వినుమా
కలదొక పావనతరమగు కథ యది యిపుడేఁ
బలికెద సరస్వతీతట
మలరారం గారికాంత్రు లానందింపన్. 308

గీ॥ కర్దమాత్మజ యనసూయ కడిఁదిభక్తిఁ
దనుభజించుచునుండ ఛాత్రతతితోడ
నత్రిముని యా నదీతీరమందు నాశ్ర
మంబుఁ గల్పించుకొని యుండు మంజువాణి. 309

కం॥ ఆమునినాథుని యాశ్రమ
భూమికిదవు దవ్వుగ నొక పుర ములరు నటన్
శ్రీమంతుఁడు మకరధ్వజ
నామశ్రోత్రియుఁడు గలఁడు నళినదళాక్షి. 310

కం॥ అతనికి సుమతియనంగా
సుత యొండొకరితజనించె సుగుణాభరణన్
నుతియింప నెవరికిశక్యము
సతులిల నాయనుపమానఁ జరియింపఁ దగున్. 311

కం॥ మకరధ్వజుఁ డంతఁ గుమా
రిక నిర్మలచరిత సుమతిఁ బ్రియమారఁగఁ గై
శిక సుతుఁడగు శశికరునకు
సకల వ్రతు లభినుతింప సల్లగ్నమునన్. 312

గీ॥ పరిణయం బాచరించి దంపతుల నాత్మ
సదనమున నుండఁగాఁ జేసి సంపదలను
వారికైవశంబుగఁ జేర్చి వనికిఁజనితాఁ
దపము సేసెడు నభివాంఛితం బెసంగ 313

క॥ తనమామ చనిన యంతట
వనితా తిలకంబుఁ గూడి వైభవయుతుఁడై
తనరుచు నుండె శశికరుఁడు
ఘనులందఱు దనుఁగనుఁగొని కైవారమిడన్. 314

క॥ దంపతుల రూపరేఖలు
సొంపార విటీవిటు లటుఁ జూచి విరాళిన్
అంపెత్తి వారిఁగలఁచు త
లంపుగొనిరి దోషమునక లలనాతిలకా. 315

గీ॥ అంత నొక కొందఱు దురాత్ము లతనిఁ జేరి
చనువుచేసి దేవళమున సానియాట
నేడు బహువిచిత్రంబుగా నెగడు ననుచు
వాంఛ కల్పించి తోడ్కొని యరిగి రటకు. 316

గీ॥ వేదశాస్త్రములఁ బఠించు విప్రవర్యుఁ
డాతఁ డాటచేడియఁ జూచి యధికమోహ
పరవశుండై కటా దాని బసకు నేగ
దుష్టమైత్రి వృథాయాయె దోషమిడక. 317

గీ॥ శశికరుం డంత ఘనమోహ జలధి మునిఁగి
సానియిల్లె గతిగనుండి సకల సంప
దలను నటికి సమర్పించె తనుకృశత్వ
ముడిగి సుమతికిఁ దెలుప కాయూరు వదలె. 318

గీ॥ దుష్టజనముల మాయలఁ దూలిపడక
ధవుని నతిభక్తితో నెప్డు దలఁచు సుమతి
తనదువరి పట్నమును బాసి చనుట యెఱిఁగి
తత్క్షణం బాతఁ డరిగినదారిఁ బట్టె. 319

క॥ చనిచని నిజనాథునిగని
వినయోక్తుల నతని దేర్చి విధికృతమునకున్
వనరంగనేల కలుములు
జనకోటికి నింతయేని శాశ్వత ముగునే. 320

క॥ అని నానావిధముల బో
ధనచేయు సతిసుగుణంబుఁ దలఁచుచు నెంతేఁ
దనచెయ్వుల నిందించుచుఁ
జనిచని పద్మపురిఁ గాంచె శశికరుఁ డలఁతన్. 321

క॥ ఆపురమున నొక గుడిసెను
గాపుర మొనరించె నతఁడు కాంతారత్నం
బోపికతో బిచ్చసలిపి
సాపడువస్తువులు దెచ్చి సమకూర్పంగన్. 322

గీ॥ సర్వవల్లభాసంభోగ జనితరోగ
మున వడఁకుపతి నారోగ్యవంతుఁ జేయ
వెదకి వెదకి దోషజ్ఞుల వేఁడి వేఁడి
మందులను దెచ్చుఁ గడకఁ నామహితచరిత. 323

క॥ ఆరీతిని భిక్షాటన
మారూఢతఁ జేసిచేసి యాత్మీయవిభున్
గారాబమ్మున మనుచు స
తీరత్నము చూప మద్వితీయంబగుచున్. 324

చ॥ కనుఁగొని తత్పురీశునకుఁ గాంతలఁ గూర్చుచునుండు ధూర్తకుం
డనునొక డింగరీఁ డతివ యందకువచ్చి నృపాలుకీర్తి వాఁ
కొని తనవృత్తిఁ దెల్ప నతి కోపమడంచి మృదూక్తి వాడునో
యనఘచరిత్ర నీహృదయ మారసితిం దగదట్టు లెన్నఁగాన్. 325

శా॥ ఇంక నాకపారి నాకటకు నీవరుదెంచిన నిన్నా నుర్వినా
యకు శపించుతుంబోమ్మనె భయంబున బోడటు మెల్లొందు పల్కి పె
ల్కక నృపుం జేరం బోయి ద్విజకాంతనుటు ద్దెలుపంగ రాజు మూ
ఢ్రదుపయుం గోపగించుకొని ధర్మచరిత్రుడు నింతుభక్తితోన్. 326

క॥ ప్రతిదిన మాయావస్తువు
లతివలచే నంపగ సతి యతిమోహమునన్
క్షితిపతి దీవించుచుం దన
పతికిని దేహాం బోకింత బాగుపడె చూడాన్. 327

మ॥ హరిసేనాంకుడు తత్పురీశుం డొకనాడా వీటిరావీధి రో
గరితన్ సుందరి సౌధ జేయ నది వేడ్కంజూడగా భార్యతో
ధరణీదేవుడు పోయి పాత్రసాగసుం దాం గాంచి కామాంధుడై
మరతెం గొంపకుం గామకుల్దమకొదన్ మజ్జారె భావింతురే. 328

గీ॥ శశిధరుండు గోలోమిటిం జాలంజిక్కి
బసకు సతితోడ నేతెంచి వెసనపడుచు
నిదురపోవక బోసము వదలియుండె
సాధ్విసుమతి యత్యంత విచార మొంద. 329

ఉ॥ అంగన యంత భర్త హృదయంబు నెఱింగి మరిన బోయి శం
డాంగన మందిరంబుం జేర నానటి యామెకుం బూర్ణభక్తి సా
ష్టాంగ నమస్కృతుల్ సలిపి యస్మదగారముం బావనంబుం జే
యంగరుణించినా రనుచు నల్లన నమ్రతదోరపం బల్కినన్. 330

ఉత్సాహ॥ సుమతియంత సంతసమున స్సంగరాంగిం జూచి మో
కముల వక్త్రనేత్ర యొందు కార్య మొండి వచ్చితిన్
ప్రమదమారం దీర్పు నీదు భాగమంచుం బల్కుచున్
రమణి వాంఛ మెల్లగాను రమణికిని వచించెం దాన్. 331

క॥ ఆయూరి తేనికొమరుఁడు
నీయొద్దకు దూతినంపె సేవింపఁగదా
యాయెమ్మెలాడి యాతిన
యాయాసీతులను వానినగు సేవినఁగాక. 350

క॥ దారకొతుకు మంజగేఁడిఁకెఁ
బరువును దీయునని వెలవఁబడి లేమసూరు
కరుణ జనింపఁగ నేద్పుచుఁ
గిరాతి బ్రతిమాలుకొనుము కిసలయపాణీ. 351

క॥ అనవుడు మణిమాలిక యా
వినఁదగు నీతులను వేశ్య విని దిన చిలుకం
గొనియాడుచు ఫలము లొసఁగి
మనమెంతయు మూరిఁబోవ మలయుచునుండెన్. 352

క॥ రాకొమరుని దూతికయును
నాకుం జెనకత్తె యంత వరుదేర మహా
శోకముతో మణిమాలిక
యాకాంతకుఁ గరుణవుట్టు నటు ప్రార్థించెన్. 353

క॥ అటు వేఁడి విశేషధనముఁ
గుటిలాత్మకు నామె యొసఁగఁ గుతుకమున మాటా
మాటినడలతోడ నది చని
పటుతర వాగ్విని తేనివట్టిఁ దెలిపెన్. 354

క॥ మణిమాలికా మహాగుణ
గణమ్ము తెలముఁ బలికి మతికాంత నృపజుతో
ఘృణగలిగి నాదువాక్యము
అణుమాత్రము వినుమటంచు నాదు స్పృహాక్తిన్. 355

క॥ పరవనితలఁ గూడుట యతి
దురితావహ మన్యసతుల తోడుతునఁగాకే
హారుఁడు వరాంగచ్యుతుఁడై
పరిపరిగతుల నవమానపడె నృపలలనా. 356

క॥ వరవర్ణినిమైన జలం
ధరుసతి బృంద వెనసి హరి నానాకృతులన్
ధరణీస్థలిఁ గష్టపడియె
నరులను వనచరులఁగూడి నలినాథముఖా. 357

క॥ సరసీరుహ సంభూతుఁడు
ధరాధరతనూజఁ గాంచి తమిఁగొనుటఁగదా
శిరమొకటి గోలుపోయెను
సురలెల్లరు భీయనంగ క్షోణీశసుతా. 358

క॥ సురలోకేశుఁడు గౌతమ
తరుణీమణిఁ గలసి కాదె తనదేహమునన్
దరుణులు రోయఁగఁ బాసెం
బరభామిని పొందుపొందె పార్థివతిలకా. 359

క॥ శీతమయూఖుఁడు గీష్పతి
నాతిని బైకొనుటఁ గాదె నయముడుకళలన్
గేతిని బాసిచరించుట
భూతలపతితనయ సతులపొందు కొదుపికున్. 360

క॥ భూకాంతసుతా భృగుముని
లోకేశుసుత నురుచరిత లోలాక్షుఁడై
హా కాదనక బలాత్కృతిఁ
బైకొని యిక్ష్వాకుసుతుఁడు భస్మముగా జేసె. 361

క॥ వేదవరుని పుత్త్రికయగు
వేదవతిని రావణుండు వేధించి కటా
సోదర బంధు యుతంబుగ
మేదినిఁ గూలుటయు వినవె మితవాగ్భూషా. 362

క॥ పతిఁబాసి ఘోరవనమున
నతి చింతనుఁద్రిమ్మరు దమయంతిని జెనకన్
మతిఁగోరి శబరుఁడు చనఁడె
హితవాక్కా లోకింత వినుము నృపవరతనయా. 363

క॥ సైంధవుఁడు కటకటా మో
హాంధుండై కృష్ణ నీడ్చి యాపద గనఁడే
గంధవహసూను చేతను
బంధురగుణ భూషితాంగ పలుకులు మనుమా. 364

శా॥ ధీరాగ్రేసరరత్నపాలుసతి పాతివ్రత్య మగ్గింపఁగా
నారంజోతికి శక్యమే రమణి మాహాత్మ్యం బమేయంబు హా
కారుణ్యాత్మక కాన శాప మిడకా కాంతాలలామంబు చిం
తారత్నాకరమందు ముంగెదు మహాదైన్యంబు రెట్టింపఁగాన్. 365

క॥ లలనామణి శాపం బిడఁ
దలఁచునో యనుచు జడిసి తడఁబడితిఁ గటా
కులసతుల జోలి యేలా
వెలవెలఁదులు లేరె నీకు విమలగుణాఢ్యా. 366

ఉత్సాహ॥ అనుచుమంత్రసాని నీతు లతికయిల్లుఁ దనకుఁదాఁ
జనువుఁబట్టి యాడినంత జనవరాత్మజుండు నె
మ్మనమునందు సంకటంబు మాఱ్కొనంగ దిక్కుపై
కొనినయట్టు లట్టె యుండి కొంతసేపటికి నొగిన్. 367

కవిరాజవి॥ అతులితభక్తి జనింప నిజాలయమందు నహర్నిశలాడి ముదం
బతుకఁగఁ జేసి నటీతిలకంబని యబ్జధరుండు దయామతి రో
యాతివకు స్వప్నమునం బొడసూపి యహో కులవృత్తికి హానిగదా
యతనుఁడు సిద్ధముఁ డాతని నీఁగుము యత్నునిచే సిరులందుమొగిన్.

క॥ కులవృత్తి విడువఁదగునే
కలుములు గడుఁ గాంతువేని గలదురితంబుల్
దొలఁగును గైవల్యసుఖము
గలుగును గామాంధవైనఁ గలుషము లొదవున్. 381

క॥ కలనట్లు కరుణ శంభుఁడు
పలికె యదృశ్యుండుగాఁగఁ బదరుచు వేశ్యా
తిలకము మేల్కాని మారుని
దొలఁగించి కుబేరుఁ జేరెఁ దోయజనయనా. 382

క॥ అలకేశుఁ డొసఁగిన సిరుల
జలజానన దానధర్మ సత్కర్మములన్
బలువిధములఁ జేసి భళీ
కలుషమ్ములు నీఁగి కనియెఁ గైవల్యంబున్. 383

క॥ ఒక్కనిపై మరులుగొనిన
యక్కలికికిఁ జెటివిపుట్ట వాడఁగఁ దరమా
ముక్కంటికైనఁ జెలీ
చక్కనిదానవు వివేకసంపన్నవహో. 384

క॥ వెలచెలి మరులుగొనఁ దగదు
వలచిన యటుమాయఁ బన్ని వసువు గొనఁ జనున్
నెలజవ్వన ముడిగిన హా
కలుములు లభియించుటరుదు కమలదళాక్షీ. 385

గీ॥ తనదు సంపద లెల్లయుఁ దలఁగెఁగాదె
రత్నపాలుని విడువంగరాదె కొమ్మ
యతనికంటెను వసుదేవుఁ డధికుఁడగుట
ద్రవిణ మెంతేని యొసఁగఁడే తమక మెసఁగ 386

క॥ ఆహా సుకాంత నూతన
మోహంబున నీకు నధికముద ములర జగ
న్మోహిని విశేషధన మిడు
నాహితవచనములు మదిని నయమున గనుమీ. 387

భుజంగప్రయాతము॥ మృదూక్తిన్ శుకం బట్లు మేలైననీతుల్
మదిం గ్రుచ్చునట్లాడ మార్జాలకీరం
బిడెంతాడె నానంచు నెంతేని మోసం
బెద న్నాలుఁగా వేశ్య యింపారుపఁ డ్గన్. 388

గీ॥ రామతర్కుకు నొసఁగి యారత్నపాలుఁ
దక్షణం బింటినుండి పోఁదఱుమఁ దలఁచి
తనమతల్లిని బురికొల్పఁ దగువులాడి
వైశ్యుఁ జీవాట్లుపెట్టి యిల్వెడలఁజేసె. 389

పంచచామరము॥ కటాకటా యిదెంత మోసకత్తెగా నటించెరా
నటిం బతివ్రతాలలామవాఁగ నమ్మి యుండితిన్
విటత్వ మాదరింపనౌనె విత్త మంతమయ్యె మై
పటుత్వ మూడె గౌరవంబు పాసె నంచుఖిన్నుఁడై. 390

క॥ కోమటిబసకుంజని భా
ర్యామణి మణిమాలికకుమ హర్షం బిడుచున్
గామిని నుడిజవదాటక
కామకులం జేరకుండె ఘనులౌ ననఁగన్. 391

క॥ హరిహర విలాసుఁ డంతట
హరిసదనముఁ జేరఁబోయి యతులితభక్తిన్
గరయుగళము ముకుళించుచు
హరిపదముల దృష్టి నిలిపి యగ్గించు నొగిన్. 398

క॥ విధికిని దుఃఖం బొసఁగిన
మధుకైటభ నామకులగు మాంసాశనులన్
వధియించిన బాహాబల
యధికదయాలోల నన్ను నరయుము కరుణన్. 399

క॥ ఏవీవరంబున హయ-
గ్రీవాసురుఁడు మదమునొని త్రిమ్మరఁగ హయ
గ్రీవావతారమున రో-
ద్రోహిని దుంచినట్టి శూరవతంసా. 400

క॥ వేదచతుష్కము దొంగిలి
యాదోనిధిఁ జొచ్చినట్టి యాసోమకు బ్ర-
హ్మాదులు వొగడ ఝషాకృతి
మోది శ్రుతులను మనుతవె యమోఘచరిత్రా. 401

పంచచామరము॥ సురాసురుల్సుధాభిలాష కూరతిన్ సుధాబ్ధిన్
దిరంబుగాఁగఁ జిల్కు వేళ ధీరమున్ దృఢంబుగా
ధరించినట్టి నిన్ను నెన్న ధాతకుం దరంబె యో
పరోపకార కూర్మరూప భక్తలోకరక్షకా. 402

పంచచామరము॥ ధరిత్రిఁ జాపగాఁగఁజుట్టి దాఁగఁబోయినట్టి యా
హిరణ్యలోచనాసురేంద్రు నిద్ధశౌర్య మొప్పఁగా
వరాహఘోరరూప మొంది ద్రవ్వి ధాత్రి నిల్పవే
సురాభియాతిఘస్మరా విశుద్ధసద్గుణాకరా. 403

క॥ తనభక్తుని బ్రహ్లాదుని
దనయుండనిన్నైనఁ గన కుదగ్రత హింసిం
చిన క్రూరుఁ గనకకశ్యపుఁ
దునుమవె నరసింహుఁ డనఁగఁ దోయజనాభా. 404

క॥ పౌలోమీశుని సంపద
బాలిశుఁడై కొనిన బలిని బాతాళమునన్
జాలిఁబడి యుండ నదిమిన
లీలావటుని నిను నెంతు లేఖస్తుత్యా. 405

గీ॥ తనదు తండ్రిఁ గూలిచి గోవు గొనుచుఁ జనిన
హైహయాధీశు వధియించినట్టి శూరుఁ
బరశురాముని గాంగేయ గురుని ఘనుని
నిన్నుఁ బ్రస్తుతిచేయుదు నిర్మలాత్మ. 406

గీ॥ అఖిలలోకకంటకులైన యసురవరుల
దశవదనకుంభకర్ణుల దర్ప మడఁచి
నట్టి యేకపత్నీవ్రతు నమలచరితు
మైథిలీలోలు నిను సదా మదిభజింతు. 407

క॥ సాంబుఁ గురువిభుఁడు నొంపఁగఁ
బంబుకినుక హలముఁ జొనిపి భాగీరథి నా
స్తంబేరమపురిఁ ద్రోయుట
కుంబూనిన నిను భజింతుఁ గ్రూరధ్వంసీ. 408

క॥ పాషండ మతస్థులచే
దూషితమయ్యె జగమంచుఁ దోఁచి ధరిత్రీ
దోషముఁ బాపిన సుందరు
దోషజ్ఞుని నిను భజింతు దుఃఖవినాశా. 409

కపి॥ ఖలసముదాయము భారము నోపక గాసిని జెందెడు భూసతికిన్
బొలుపుగ మోద మొసంగెడు కోరికఁ బుట్టి మహోద్ధరితాత్ములఁ గూల్చి
బొలిసెడు మార్గ మొనర్చిన దేవకిపుత్త్రుని కృష్ణుని నిన్ను సదా
కొలిచెద మామకమోక్షము దీర్పుము కోవిదవంద్య మురారిహరీ. 410

మాలిని॥ శ్రీకరమా విరజానదియందు విరించనపూజలు సైకొని యి
క్ష్వాకునిచే సరయూవిమలావని వైభవమొంది కవేరతనూ
జాకమనీయతటంబునఁ గాంతిలు సర్వమయాత్ముని రంగపతిన్
లోకవిభు న్నినునెంతు రమేశ త్రిలోచనమిత్త్ర దయానిలయా. 411

క॥ మునివరయుగళమును విరిం
చిని స్వాహాపతిని రాజశేఖరనృపతిన్
గనికరమునఁ జంపకకా
ననమున మనిచిన దయానిధి నను మనుమా, 412

క॥ కసిగొని వజ్రకవచరా
క్షసవరుఁ గసిమసఁగి బదరికాక్షేత్రమునన్
బసగొనిన నిన్ను నెంచెద
వ్యసనమ్ము వడంపుమీ భవానీశహితా. 418

క॥ కులశేఖర భూపాలక
తిలకుని భక్తు మలయాళదేశం బలరన్
లలితగతి మనిచిన దయా
నిలయుని శ్రీపద్మనాభు నిను సేవింతున్. 414

క॥ దుష్టుల శిక్షించుటకును
శిష్టుల రక్షించుకొఱకు క్షితిఁ గలుగు బ
లకష్టముల నివారింపఁగ
ప్రస్తవనీయచరిత చరియింతు విలన్. 415

క॥ అని నానావిధముల శ్రీ
వనమాలిని నుతు లొనర్చి వసుధేశుఁడు శం
భుని సదనమునకుఁ జని భ
ర్గునకును గైమోడ్చి యను నకుంఠితభక్తిన్. 416

లయగ్రాహి॥ పన్నగవిభూషణ జగన్నుత గజాంతక వి
పన్నజనపాలక సరిన్నళిననేత్రా
హృన్నళినమిత్ర తొలి జన్మమున నీలిగిన
యన్నువుల మిన్నయగు నన్నగజ నిష్ఠన్
నిన్నె నెదఁ గోరి తప మున్నతి నొనర్పఁగఁ బ్ర
సన్నమయి మెచ్చు నలమన్నియ యొసంగన్
గన్నియ వరించి సురభి న్నిఖిలభోగములఁ
జెన్నలరినట్టి దొర వెన్నఁగఁ దరంబే. 417

మహాస్ర॥ ధరణీబింబోష్ఠి తేరై తనరఁ గనకగోత్రంబు కోదండమై భీ
కరలీలం గ్రాలఁగా నాగమము లొగిఁ దురంగంబులై పైకొనంగా
నరవిందోద్భూతుఁ డెంతే నరదము నడుపన్ హాళి వైకుంఠుఁ డంబై
హరువుం జూపంగ స్థానీయముల యసురులన్ హాపోరింగొంటివీశా. 418

స్రగ్విణి॥ దారుకాభిఖ్య కాంతార ౦ జంబునన్
సారు పెంపారు వాచంయమిప్రేయసీ
వారమున్ మారదుర్వారలీలాగతిం
జేరవే శంకరా శ్రీదఖాభ్యర్చితా. 419

క॥ కారుణ్యరసము పెంపున
వైరోచన రాత్మసేంద్రు వాఁకిటఁ దగినా
వౌరా యసదృశకరుణా
పూరితహృదయాంతరంగ ప్రోవుము నన్నున్. 420

మానిని॥ యక్షహితుండగు నీవు పదద్వయ మాత్మ దృఢంబుగ నిల్పినయా
దక్షిణదిఙ్నుతశౌర్యుఁడు పాండ్యుఁడు త్వద్దయఁ గాంచిన పుత్త్రిని మీ
నాక్షి వరించిన సుందరమూర్తివి యాండ ఫణీంద్రనకుం దరమా
త్ర్యక్ష జలంధరగర్వవిదారణ యాత్మజనేష్టద విష్ణుహితా. 421

కం॥ అని శూద్రాద్రివిహారుని
మన మారఁగ నుతులు సేసి మనుజాధిపుఁ డిం
పెనయఁగ దేవీనిలయం
బునకుం జని దేవి మ్రొక్కి పోయెను బసకున్. 422

సీ॥ అంతఁ దనదు పుత్త్రి వెదక నన్పినట్టి
భటులు రామికిఁ జింతిల్లి పార్థివుండు
దాను దేశాటనము చేసి సూనుఁ గనెడు
వాంఛ గాని వెడలె సపరివారుఁ డగుచు. 423

సీ॥ పురుషవేషంబుతోనున్న పూవుఁబోణి
సాధ్వి లలితాలతయు నిలాజానితోడ
వెడలెఁ గాళిప్రసాదుని విభుని నెపుడు
గనఁగ నా కోకో యనియెడి కాంక్ష లూర. 424

సీ॥ జహ్నుసుతమీఁదఁ బడవపై జనవిభుండు
పయనమై దారిఁ గనఁబడు పట్టణములఁ
దనయ వెదకుచుఁ జనిచని కనియె నంతఁ
గాళికాపుట్ట మనియెడు కటకవరము. 425

కం॥ కని యందఱితో దిగి కా
ళిని దర్శింపఁగ నిపుడు గలిగెఁ గద యని య
య్యనుఁడు గుడికిఁ జని శంఖ
స్వనుఁ గనె నతిశ్రద్ధ గాళిసన్నిధినుండన్. 426

కం॥ జగదంబికా పదాంబుజ
యుగళ స్మరణాయతాత్మ యోగీంద్రమణిన్
జగతీపతి గని సన్నుత
దగ నట నిలుచుకొనియుండెఁ దనవారలతోన్. 427

క॥ అట శార్వరి సంబాపద
ఘటితాత్ముఁడైన రాజకంఠీరవుఁడ
కృట సుత వెదకుటకుఁ జనిన
భటు లింకయు రా రదేమి పాటిల్లెనొకో. 428

క॥ అని వాపోవుచు నేఁ జని
తనయను వెదకెద నటంచుఁ దగువోడమియుగా
దన యాప్తులు వెనుకొని తాఁ
జనె సుత నాయాపురములఁ జాల వెదకుచున్. 429

గీ॥ అరిగియరిగి కాళీఘట్ట మంతఁ గాంచి
కాళికేశ్వరి దర్శింపఁ గలిగె ననుచు
మోదభరితాత్ముఁడయి మేదినీశుఁ
డాత్మపరివారసహితుఁడై యచట దిగెను. 430

గీ॥ హరిహరవిలాసుఁ డేతెంచినట్టిదినమె
శార్వరీశుఁ డాపురిఁ జేరి శక్తి నెలుఁగ
నేగి శంఖస్వనుని గాంచి యుద్ధభక్తి
నిలుచుకొనియుండెఁ దనవారు బలిసికొలువ. 431

క॥ తనతండ్రిని లలితాలత
గని సంతసిలుచుఁ జెనిమిటిఁ గనమి వనరుచున్
మునికిని బడియుచుఁ గాళిని
మానసమునఁ గొలుచుచునుండె మాన్యతి యచటన్. 432

గీ॥ అల్ల కాళిప్రసాదుని నరయఁ జనిన
యట్టిచారులు కాళికాఘట్టమునకు
నాటినంబున నేతెంచి యంబఁ గొలువ
నేగి విభుఁ గాంచి నిలిచిరి మూఁగలగుచు. 483

గీ॥ శార్వరీశుఁడు పంపిన చారు లంపు
నంచుఁదిరిగి కాళీఘట్ట మపుడె చేరి
యంబ సేవింపఁ జని తమ యధిపుఁ గాంచి
యతని వెనుక నిల్చిరి యద్భుతాత్ములగుచు. 484

గీ॥ గడనకత్తె నేఁగి కాళిప్రసాదుఁడు
చిలుకరూపుతోడ జివ్వన నటు
పాఱి మిన్నునంటి పాటు చిలుకపిండు
గాంచి దానియందుఁ గలుసుకొనెను. 485

గీ॥ కాళికాఘట్టమునకు శోకంబు పాఱి
కాళిగుడియందు ఫలసుమా కలితవకుళ
భూరుహము మీఁద వ్రాలంగ భూపజుండు
గనియె వేడ్క శంఖస్వన మునిని నచట. 486

క॥ మునినటు రాజసుతుఁడు గని
జనితానందంబుమీఱ సంయమియొమగన్
జని భక్తిఁ గదలకుండెను
దనమోక్షము దీఱుఁ దపసి దయచేసెనుఁగా. 487

చ॥ అతులిత నిష్ఠఁ గాళికను ధ్యానముసేసెడు మాని యంతమే
ల్గతిఁ గనువిచ్చి యొట్టెటుదగం దిలకించుచు నుండ శార్వరీ
పతియు రమాకరేశుఁడు తపస్వికి మ్రొక్కి రయోగిన్ ఘనోవ్యథన్
యతనిదెల్పి మీర గతియంచును వేఁడఁగ యోగినప్పుచున్. 488

చ॥ తగుఁదగు శార్వరీశ లలితాలత యిచ్చట నిల్చియుండఁగా
వగవగ నేలయంచు వరవర్ణిని జూపి సతీచరిత్రముం
దగ వినుపించి యామె నడత న్నుతియించి రమాకరేందుతోఁ
బొగలకుమయ్య నీవిచటఁ బుత్త్రిక నిగ్గుమువటంచు వాఁకొనెన్. 439

తే॥ తనదు యోగదృష్టిని సమస్తంబుగ నెఱు
కాళికాంఘ్రిస్మరుఁడు పారికాంక్షివరుఁడు
దీనభావంబు గొను చిల్క తెఱఁగెఱింగి
కుంకుమము దానిపైఁ జల్లెఁ గుతుకమలర. 440

క॥ ఆకుంకుమ రజమొదలిని
సోఁకిన యానిముసమందు శుకరూపంబున్
భూకాంతసుతుఁడు వదలి ని
జాకారము గొనియెఁ దాపసాగ్రిమమహిమన్. 441

తే॥ ఆనిరాబారి మగఁడంత నందఱఁ గనుఁ
గొనుచుఁ గాళీప్రసాదుఁడు వసికి వేఁట
కొఱకుఁ జనినది మొదలుగాఁ గొఱఁతలేక
యొగిని నైజకంఠధ్వని నుగ్గడించె. 442

క॥ మునినాథుఁడంత నందఱు
దనతో రాఁ గాళిసన్నిధానంబునకుం
జని లలితాలతకు నృపతి
తనయునకు వివాహ మెలమిఁ దానొనరించెన్. 443

క॥ దంపతులకు నటదీవెన
లింపారఁగ నొసఁగి సంయమీంద్రుఁడు చనియెన్
బెంపారెడు క్షేత్రంబుల
కంపాలతికాంగి నంబ సంసేవింపన్. 444